ఆంధ్రసచిత్రవార

# పత్రిక



## యువతులూ-
## ఉద్రేకాలూ

19-10-62 25 నయాపైసలు

లైబ్రరీ పుస్తకాలేవో తీసుకొచ్చారటగా-
గడువైపోయిందిట-
తిరిగి ఇచ్చెయ్యమని కబురెట్టారండీ-

# 26-10-62

# ఆంధ్రసచిత్రవారపత్రిక

# దీపావళి సంచిక

## ప్రత్యేక ఆకర్షణలు

- ★ బహుమతి కథలు
- ★ "రాజకీయాలలో స్త్రీలపాత్ర" బహుమతి వ్యాసాలు
- ★ చిత్రవ్యక్తుల్లో 'సూర్యకాంతం'
- ★ కొన్ని సందేహాలకు శ్రీ బి. యస్. రెడ్డి జవాబులు
- ★ ముఖచిత్రం: బాపూ

ఇవిగాక మామూలు శీర్షికలు, సీరియల్ కథలు ఉంటాయి.

**ఎక్కువ పేజీలు - వెల మామూలు**

# ఉత్తరాలు

## ముఖచిత్రం

దసరా సంచిక ముఖచిత్రం చూడ ముచ్చటగా ఉన్నది. ఎన్నిసారులు చూచినా తనివితీరడం లేదు. చిత్రకారుడు శ్రీ డి. ఆర్. గార్కి నా హృదయపూర్వకాభినందనలు.

ఎ. వి. రంగయ్య (గుంతకల్లు)

* * *

ఈ వారం ముఖచిత్రం దసరా బొమ్మ చాలా బాగుంది. ఇంతకూ దసరా బొమ్మ చిత్రకారు డెవరో తెలుపుతారా ?

గానిగ రాజారాంబాబు (గుంతకల్లు)

శ్రీ దశిక రామలింగేశ్వరరావు.

## కథలు

వక్కలంక రామారావుగారి రచనా సమిధల మండి వెలువడిన 'కథకాక' .... మా బుర్రలను వేడెక్కించినదంటే నమ్మండి బాబు.

భండారు వెంకటేశ్వరరావు (ఖమ్మంమెట్టు)

* * *

శ్రీ వక్కలంక రామారావుగారు రచించిన "కథ కాక ...." అనే కథ చాలా బాగుంది. కథ ముగించే సరికి మాకు సందేహం కలిగింది. ఇంతవరకూ చదివింది "కథకాక" .... ఏమిటి ? అని. ప్రేమలో పడిన వారికి మతిమరుపు సంభవిస్తుంటుంది అనే సత్యం సుబ్బారావు యెడల నిజమయింది. రచయితగారికి మా ధన్యవాదాలు.

విజయసాయి (అవకాపల్లి)

* * *

నావ వెలిసింది—కథ చాలా బాగుంది. రచయిత ఈ కథలో అల్లుళ్ళ పట్టుదలలూ, అలుకలూ గురించి చక్కగా చిత్రించారు. కానీ ఈ కథ ఆఖరిలో—కృష్ణారావ్ "హఠాత్తుగా మీకు కనపడాలని అనుకున్నానండి"—అనుట సమంజసముగా లేదు. ఈ మాట వలన అతని ఉద్దేశ్యము ఏమిటి? —అయినా కథ రసవంతంగానే ఉన్నది. రచయిత శ్రీ కాళిదాసుగారికి నా అభివందనములు

ఎం. కె. రామచందర్‌రావు (ఖమ్మంమెట్టు)

* * *

'ఆదివిష్ణు' వ్రాసిన కథలు చదివి చాలా నాళ్ళయింది. ఈ వారం కథ చదివాను. బాగానే ఉంది.

ఎం. ఎస్. రామశేషు (మాజీవిడు)

* * *

"వరబలి" కథ నా కెంతో నచ్చింది. ముఖ్యముగా రత్న ఆఖరి గడియల వరకు తనకు జరిగిన అవమానము భర్తతో కూడ చెప్పక ప్రాణములు విడిచినది. అట్టి స్త్రీ తనకు జరిగిన అవమానము తనతోనే మాపుకొన్నది. కాని భర్త యెడల ఉన్న గౌరవము కొలది తను మనోవ్యథకు లోనై క్రుంగిపోయెను. అటువంటి కథ వలన మీయొక్క పత్రికకే కాక, వ్రాసిన రచయితకు కూడా ఎంతో గౌరవం తెచ్చినది.

ఎస్. పార్వతీశ్వరరావు (జలుమూరు)

## సీరియల్ కథలు

శ్రీమతి కోమలాదేవిగారి 'బంగారు పంజరం' చాలా బాగున్నది. రచయిత్రిగారు కథలో, [illegible] హృదయాలలో చెలరేగే బాధలను, భావాలను సహజముగా చిత్రీకరించారు.

సరోజాదేవి (కొత్తూరు)

* * *

"బంగారు పంజరం" చదువుతూంటే దేశంలో ఎంతమంది కుటుంబాలకు ఇట్లా జరుగుతుండవచ్చు అనిపిస్తోంది. ఈ వారం పత్రికలో ఒక పొరపాటు దొర్లింది. అదేమిటంటే రచయిత్రిగారు కుసుమ సంసారాన్ని చిత్రిస్తూ, కుసుమ బావగారి అసభ్య ప్రవర్తనను మనకి తెలియజేస్తున్నప్పుడు "వెంటనే రాళ్ళు, రాళ్ళు. పెట్టేది అన్నమా, సున్నమా .... రాళ్ళా .... ఛీ ఛీ, కుసుమా .... అంటూ ఒక వ్యక్తి దూసుకుంటూ హాల్లోకి వచ్చాడు. నిర్మల బెదిరిపోతూ నుంచుంది" అని వ్రాశారు. ఇక్కడ నిర్మల ప్రసక్తి ఎందుకు వచ్చిందో ! అసలు నిర్మల బదులు కుసుమ ఉండాలి.

ఐ. వి. ఎస్. చలపతిరావు (గుంటూరు)

అవును.

## నేనూ - మా రాజుగారూ

"గేస్‌కెల్లీ" వ్రాసిన "నేనూ—మా రాజుగారూ" లో, రాజులాంఛితమైన వివాహం కళ్ళకి కట్టినట్టు చాలా బాగా యున్నది. వ్యాసం ప్రచురించినవారికి ఈ పాఠకువి ధన్యవాదాలు.

మాధవి (మార్కాపురం)

## కూచిపూడి నాట్యం

'దసరా సంచిక' లో మీరు ప్రకటించిన ప్రత్యేక వ్యాసం 'కూచిపూడి నాట్యం' చాలా బాగుంది. ఆంధ్ర సోదరీమణులు తమ వ్యాసంలో క్లుప్తంగా చక్కగా 'కూచిపూడి నాట్యాన్ని గూర్చి తెలియజేశారు. కాని వ్యాసం మరికొంత వివరంగా ఉంటే బాగుండేదేమో !

ఎస్. శారదాదేవి (హైదరాబాద్)

* * *

శ్రీల ప్రత్యేక ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా ఉన్నది. ముఖ్యముగా "కూచిపూడి నాట్యం" అనే వ్యాసం చాలా బాగున్నది. వ్యాసం అందజేసిన ఆంధ్ర సోదరీమణులకు అభివందనలు మీ పత్రిక ద్వారా తెలుపుకోరుచున్నాను.

పి. సుభద్ర (ఆత్మకూరు)

## చిత్రవ్యక్తులు

మా అభిమాన నటుడు రామకృష్ణను పత్రిక ద్వారా పరిచయం చేసినందుకు మా సంతోషం తెలియపరుస్తున్నాము.

మోటూరు లక్ష్మి, వెంకట్రావు, రాజా, సంజీవి. (మామిడివాడ)

## న్యూఢిల్లీ లేఖ

ఉత్తర దక్షిణ భారతాల్ని కేంద్ర ప్రభుత్వం వివిధంగా 'శీతకన్ను' తో చూస్తూ ఉన్నది శ్రీ కృష్ణ గారు దసరా ప్రత్యేక సంచికలో సూటిగా, స్పష్టంగా వ్రాయటం హర్షణీయం. ముఖ్యంగా ఆంధ్రుల ఆందోళన, ఆవేదనను శ్రీ కృష్ణగారు తమ 20 సంవత్సరముల తరువాత మద్రాస్ సందర్శనలో తెలుసుకున్నదానికన్న ఎక్కువగానే అర్థం చేసుకుంటా రనుకుంటా. ఆయన ఇటు ఆంధ్రం పర్యటిస్తే బావుణ్ణు. రైలుపెట్టెల పరిశుభ్రత్యం, సౌకర్యాల అవసరాలు మద్రాస్‌కన్న ఎక్కువే కావాలని వ్రాస్తారు వారు నిజంగా. ఈలాంటి వ్యాసాలు శ్రీ కృష్ణగారు ఉత్తర భారతం పత్రికల్లో వ్రాసి, దక్షిణ భారతం దుస్థితి అక్కడివారికి తెల్పితే—'చద్దిఅన్నం తిన్న అమ్మకు మొగుడు ఆకలి తెలీద' నే ఉత్తర భారతం వారికి ఇక్కడి స్థితి అర్థమవుతుంది.

రామావా (రాజమహేంద్రవరం)

## రాజధాని కబుర్లు

శ్రీ బి. ఎల్. ఎన్ గారు వ్రాసిన రాజధానికబుర్లు శీర్షిక చదివాను. వారు జంటనగరములలోని రోడ్ల పరిస్థితి చాలాచక్కగ చిత్రీకరించినారు. వారు చెప్పినది మాటికి నూరుపాళ్లు సత్యమే. యేదోరోడ్లు సంగతెందుకు! సెక్రటేరియట్ ముందున్న రోడ్డు గతే అట్లాఉంది. ఆ రోడ్డును మూడు భాగములుజేసి, ఇరుప్రక్కల సైకిళ్ళు, రిక్షాలు పోవునట్లు, మధ్యలో కార్లుపోవుటకును ఏర్పరచారు. (హైదరాబాదులో అన్నిరోడ్లు ఇలాగే చేయబడినవి) సైకిళ్ల, రిక్షాల భాగము ఎట్లున్నదనగా ఆ దారిన పోవునప్పుడు సైకిలును భుజమునకు తగిలించుకొని నడిచిపోయిన గమ్యస్థానము త్వరగా చేరవచ్చును!!. రచయిత చెప్పినట్లు ఇలాంటివి రాజధానిలో కన్నులపండువుగా కనిపిస్తాయి!

ఇంకొక ఉదాహరణ:—సీతాఫల్ మండినుండి యూనివర్సిటీకి పోయే దారి సిసలైన పల్లెదారి! యీ దారిలో భారీవిత్తున సిటీబస్సులు నడుస్తున్నప్పటికీ అది కంకరరోడ్డు తప్ప—సిమెంటు, కనీసం తారురోడ్డు కాలేదు. అధికార్లకు తలపు వచ్చినప్పుడు నాలుగుతట్టలు మట్టిపోస్తారు. ఒక జల్లుపడగానే దాని (రోడ్డుయొక్క) సొగసు బయట పడుతుంది! పురపాలక సంస్థకు ఇంత శ్రద్ధ ఎందుకో అర్థంకాదు!!

సి. హెచ్. ఎస్. (సికింద్రాబాదు)

## సరాగమాల

వి. ఏ. కె రంగారావుగారు మాడరన్ థియేటర్స్ (సేలం) నిర్మించిన (ఆడజన్మ, అత్తింటికాపురం, అన్నా—చెల్లెలు) నిర్మాత పేరు తెలియజేయమని కోరుతున్నాను.

కొత్తపల్లి రాజరత్నం (భిక్కుమారు)

## కార్టూనులు

సురేఖగారి రేఖాచిత్రం బాగుంది. ఆవిడకు నా అభివందనములు. 'సురేఖ' (పుంగనూరు)

## రూప

"రక్తసంబంధం" రీహార్సల్స్‌లో శ్రీ ఎన్. టి. రామారావు; దేవిక—కాంతారావు; సావిత్రిల ఫోటో తీసి—పత్రికకు అందించిన శ్రీ రూపగార్కి నమోవాకములు

—కె. వెంకటస్వామిరావుపట్నాయక్ (వేణుమ్మపేట) ★

నొప్పులను పోగొట్టుకొనుటకు

# సారిడన్ 'రోష్'

వేసుకోండి!















ఒకే ఒక బిళ్ల చాలును

ఒక బిళ్ళ ఖరీదు 13 నయా పైసలు

సారిడన్ నొప్పులకు వెంటనే ఉపశమనము కలిగిస్తుంది. అది మూడు విధములుగా పని చేస్తుంది — నొప్పిని పోగొట్టుతుంది, సేదదేరుస్తుంది మరియు నవోత్సాహమును కలిగిస్తుంది. తలనొప్పి, ఒళ్లునొప్పి, పంటినొప్పి, జ్వరముగా ఉండుట, మామూలు అస్వస్థతలు మొ॥ వాటికి సారిడన్ వేసుకోండి. అది త్వరితముగా, నిశ్చయముగా మరియు నిరపాయముగా ఉపశమనము యిస్తుంది. ఒక సారిడన్ బిళ్ళ పెద్దవారికి పూర్తి మోతాదు. పిల్లలకు ¼ నుండి ½ బిళ్ళ వరకు చాలును.

'రోష్' తయారు ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వాల్టాస్ లిమిటెడ్

ఆంధ్రసచిత్రవార

# పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 19—10—62
శుభకృత్ సం॥ ఆశ్వయుజమాసం॥ బ॥ సప్తమి
సంపుటము : 55 సంచిక : 7
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానంద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా: 135.00.)

*

విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13.0.0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టివీథి, మద్రాసు-1




వర్తమాన నటుడు హరనాథ్.

## మనలోమాట

ఈ సంచిక నుండీ ఆంధ్ర సచిత్ర వారపత్రిక కొత్తరూపు ధరిస్తోంది! మేం పరిచయం చేస్తున్న చిత్ర వ్యక్తులే ముఖచిత్రంలో కొత్త తరహాలో కన్పించటం పాఠకులకు ఉత్సాహ హేతువౌతుందనే అనుకుంటున్నాము.

•  •  *

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకు చిరపరిచితులైన శ్రీ బాపూ ఈ కొత్త ముఖచిత్రాలు రూపొందించారు.

•  •  *

ఈ కొత్తరకం ముఖచిత్రానికి, చిత్రవ్యక్తులకు కావలసిన ఫోటోలు శ్రీ రూపా అందజేస్తున్నారు.

*  *  *

వచ్చేవారం ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచికగా వెలువడుతున్నది. పాఠకులకు ఈ సంచిక 'మెదడుకు మేత'గా వుంటుందని వేరే చెప్పనక్కర లేదనుకుంటాము.

## లోకంపోకడ



"మనదేశంలో, మంచి లాభసాటి వృత్తి ఏదో ఎవరైనా చెప్పగలరా?"

"మాష్టారు నాకు తెల్సు! అదే! దొంగరవాణా."

## విషయానుక్రమణిక

కథలు :

| | |
|---|---|
| తానొకటి తలిస్తే | — 24 |
| సీతారామ యుద్ధం | — 32 |

సీరియల్ కథలు :

| | |
|---|---|
| 'నేనూ—మా రాజుగారూ' (గ్రేస్‌కెల్లీ కథ) | — 9 |
| హరివంశము | — 16 |
| కుమారి కళ (బొమ్మల కథ) | — 19 |
| విశాలనేత్రాలు | — 23 |
| బంగారు పంజరం | — 26 |

శీర్షికలు - వ్యాసం :

ఉత్తరాలు — 3, ఉమెన్ కార్నర్ — 6, న్యూఢిల్లీ లేఖ—7, కథకాని కథలు – 8, ప్రపంచ ప్రముఖులు—10, చిత్రవ్యక్తులు—11, రాజధాని కబుర్లు—13, వివిధప్రాంతాల వింతప్రదేశాలు—15, యువతులూ – ఉద్రేకాలూ (వ్యాసం) — 17, వనితావాణి—18, మనమూ – మనదేహస్థితి—21, సరాగమాల — 25, చదువులరావు — 27, వారఫలాలు—28, హమేషా–తమాషా—31, ఎవరికో (గేయం) — 53, యువప్రపంచం—61, కొత్త నుడికట్టు—63, పొట్టికథలు—64.


భారత దేశంపై దురాక్రమణకు ఉత్తరువు
సంప్రదింపుల కోసం ఢిల్లీకి అభ్యర్థనాపత్రం
కమ్యూనిస్టు చైనా
హే! అంతా ఘనవ ఆటకు సాకులే పావులే
ఫరవాలేదు! దాన్నిచంపెయ్, గెలుపునీదే
లంచగొండితనం
సన్నిహితత్వ యత్నం
చేతులు కలిపే ప్రయత్నం



స్వదేశానికి తిరిగివచ్చిన ప్రధాని నెహ్రూను అభినందిస్తున్న రాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్.

# పారిశుధ్ధ్యమెరుగని కేంద్ర సచివాలయాలు: క్లిష్టస్థితిలో దుబారాకు ప్రయత్నించే కేంద్రం

శ్రీకృష్ణ

ఇప్పుడు న్యూఢిల్లీ అంతా గాంధీ జయంతి సందడిలో ఉంది. గత రెండేళ్లుగా జరుగుతున్న మాలు వడికే కార్యక్రమంతోబాటు, ఈ నెల 2 నుంచి జాతీయ పారిశుధ్య వారోత్సవం జరుగుతున్నది. ఉదాహరణకు కేంద్ర సచివాలయం తీసుకోండి. దాని గోడలనిండా ప్రజలకు పరిశుభ్రతను బోధిస్తూ కాగితాలు అంటించారు. ఎక్కడ చూచినా "పారిశుధ్ధ్యమే పరమాత్మ" "శాంతి వలెనే పారిశుధ్ధ్యంకూడా వేరు చేయరానిది" అనే ప్రకటనలే. మళ్లీ ఇంకోపక్కన ఇది మా ఖాతాచి, కష్టార్జితమూ అన్నట్లు 15 ఆగష్టు 1947 నుంచి పేరుకుపోయిన పెంటకుప్పలు కుప్పలుగా పడి ఉన్నాయి.

ఇటీవల ఓ మధ్యాహ్నం కేంద్ర సచివాలయం ఉత్తరపు బ్లాక్‌లోకి అలా నడిచివెళ్లాను. సచివాలయాన్ని కాస్త శుభ్రంగా ఉంచుతున్న జాడే కన్పించలేదు. అందంగా మెరుస్తూవుండే ఎర్ర రాతిగోడలు మకిలి, దుమ్ముపట్టి, ఉమ్మి చారలతో అసహ్యంగా ఉన్నాయి. సైనిక, నౌకా దళాధిపతుల కార్యాలయాలకు పోయే మేడమెట్లు న్యూఢిల్లీ ప్రభుత్వాలయాల్లో ఉండే మురికితనానికంతటికీ ప్రతిబింబాలు!

అప్పనంగా వచ్చిన పెద్ద పెద్ద భవనాల్లో కాపురముంటూ, తద్వారా భారతదేశం కోసం, ప్రజల కోసం 'పెద్ద పెద్ద త్యాగాలు' చేస్తున్న మంత్రి శేఖరు లేం చేస్తున్నట్లు ? ఆ భవనాలు చూసే మహద్భాగ్యం కూడా కలిగింది నాకు. అలాంటి పెద్ద భవనంలో ఒకప్పుడు ఎంతో పరిశుభ్రంగా తళతళలాడుతున్నట్లుండే మంత్రి — కార్యాలోచన మందిరం ఎంతో మట్టి కొట్టుకుని ఉంది. ఈ మంత్రిశేఖరులు, సచివాలయ కార్యదర్శులు, 1947 ఆగష్టు 15 వరకు జరిగినట్లుగానే ఆ తమ పరిసరానుగుణమైన పారిశుధ్ధ్యంపై మనస్సు ఉంచి ఉంటే, కేంద్ర సచివాలయమే న్యూఢిల్లీలోకల్లా చాలా పరిశుభ్రమైన ప్రదేశంగా రూపొందేది. ఇప్పుడు మన మంత్రులకు వాళ్ల గదులు శుభ్రంగా ఉంటే చాలు, ఎలాగోలాగా కళ్లు మూసుకుని గదుల్లోకి వచ్చిపడతారు. మన కార్యాలయమంతా పరిశుభ్రంగా ఉండాలి అన్న నియమం కాని, లేక పోయిందేన్న బాధ కాని—పాపం—వాళ్లకు లేవు. అసలు వాళ్లనని ఏం ప్రయోజనం! తప్పంతా కార్యదర్శులదే. బ్రిటిష్ ఐ. సి. ఎస్. అధికార్లుగా ఎంతో పరిశుద్ధ వాతావరణంలో పనిచేసిన ఈ కార్యదర్శులు పారిశుద్యం రక్షణనుంచి ఇంత త్వరగా ఎలా స్వతంత్రం పొంది విముక్తి పొందగలిగారా అని ముక్కుమీద వేలేసుకో బుద్దేస్తోంది! వీళ్లు తమ ఆంతరంగిక కార్యదర్శుల కార్యాలయాలను కొంచెం సందర్శించివుంటే, ఎక్కడ పడితే అక్కడ ఎలా మురికికూపాలు తయారైందీ తెలుస్తుంది.

పనిలో పనిగా ఈ సందర్భం సర్వత్ర నిరాయుధీకరణాన్ని కోరుతూ బహిరంగసభలు జరపటానికి, చక్కగా ఉపయోగపడింది. గతవారంలో రాజధానికి తిరిగి వచ్చిన మన ప్రధాన మంత్రి ఒక ప్రసంగంలో శాంతికాముకమైన భారతదేశంపై చైనా ఎలా దురాక్రమణ కొనసాగించి శస్త్రధారణకు ఎలా రెచ్చగొడుతున్నదీ వివరించారు. శోచనీయమైన విషయం ఏమిటంటే భారత

— 59వ పేజీ చూడండి

# కథ కాని కథ

## సీతారాముడూ
### (మొదటి బహుమతి)

మా ఇంటికి రెండో ఇంట్లోకి క్రొత్తగా ఒక కుటుంబము కాపురము వచ్చింది. ఆమెకి ఒక గేదె ఉన్నది.

మా ఇంట్లో ఒక పోర్షనులో ఉన్న ఆయన పేరు సీతారాముడు, టాక్సీ డ్రయివరు. బాగా ప్రొద్దుపోయి రాత్రిళ్లు వచ్చి తెల్లవారి ఎనిమిది అయ్యేవరకూ నిద్రపోతూ ఉంటాడు. అతనికొరకు ఎవరో తరచు వస్తూఉంటారు. తెల్లవారుజామున సీతారాముడూ, సీతారాముడూ అనుట వినిపించి, ఎవరూ? ఎవరండీ అంటూ, బయటకు వచ్చాడు. ఎవరూ లేరే అంటూ లోపలకు వెళ్లాడు. మళ్లీ అలాగే వినిపించినది. విసుగుతో "సీతారాముడూ, సీతారాముడూ అంటారు. ఎవరూ కనిపించరే" అన్నాడు. మేమంతా ఈ సంభాషణ వింటున్నాము. ఇంతలో ఆమె 'నేనేనయ్యా. 'అంది.

'ఎందుకు పిలిచారు?' అన్నాడు. 'నిన్ను కాదయ్యా! మా గేదెని. దాని పేరు సీతారాముడు. నేనల్లా పిలుచుకుంటాను బాబు! నీ పేరుకూడా సీతారాముడేనా?' అని ఆమె అంటూంటే అతను నిద్రమత్తుపోయి, నవ్వుకున్నాడు. మా కందరకూ కూడా నవ్వు ఆగిందికాదు. ప్రతి రోజూ ఆమె 'సీతారాముడూ, అంటూవుండటం' ఈయన, ఆ, అనటం పరిపాటయింది.

వై. శంకర్, (బందరు)

* * *

## కింకర్తవ్యం!
### (రెండవ బహుమతి)

నేను మూడవఫారం చదివే దినములలో మద్రాసులో గోపీ అనే విద్యార్థి ఉండేవాడు. వాడు భలే తుంటరి. ఒకనాడు మా తెలుగుటీచర్ 'కర్తవ్యం' అనే పాఠం బోధిస్తున్నాడు. స్త్రీల కర్తవ్యాలు స్త్రీలు, పురుషుల కర్తవ్యాలు పురుషులు తెలుసుకొని, వాటిని ఆచరించుతూ ఉండాలని చెప్పుతున్నాడు. ఇంతలో గంట కొట్టారు. కానీ మాష్టారు రేమో గంట వినపడనట్లు పాఠం చెప్పుతూ పోతూ 'కర్తవ్యం' అనే మాట ఉపయోగించి ఒక వాక్యము చెప్పమని మా గోపీని అడిగాడు.

వాడు వెంటనే, లేచి, "బెల్ కొట్టగానే క్లాసులోనుంచి లేచి బయటకు వెళ్ళడం మన కర్తవ్యం" అన్నాడు.

ఎస్. ఎల్. నర్సయ్య (కడప)

* * *

## ఉండు బాబూ!
### (రెండవ బహుమతి)

నేను మా ప్రక్కింటి తాయారమ్మగారికి అప్పుడప్పుడు ఉత్తరాలూ గట్రా రాసిపెడుతూ వుండేవాడిని. ఆవిడ నా చేతనే వ్రాయించుకునేది. అలా రాయించుకున్నప్పుడల్లా - లడ్డూలో, కజ్జికాయలో - పకోడీలో ఆవిడ ఇంట్లో ఏమివుంటే అది పెడుతూ వుండేది.

ఒకరోజున, ఆమె నా చేత ఉత్తరం వ్రాయించుకుని లోనికి వెళ్ళింది. మామూలు ప్రకారం ఏదో తినుబండారం తెచ్చిపెడుతుందని సావిట్లోనే కూర్చున్నాను. ఎంతసేపటికీ ఏమీ పెట్టలేదు సరికదా! ఆవిడ లోపలినుంచి సావిట్లోకే రాలేదు.

వెళ్లిపోతున్నానండి అన్నాను. "ఆఁ వుండు బాబూ!" అంది లోపలినుంచే. ఉండమంటున్నది కదా! ఏదో తెచ్చిపెడుతుందని మరో పావుగంట కూచున్నాను. ఆవిడ రానేలేదు. నే వెడుతున్నా బామ్మగారూ అన్నాను. ఆఁఆఁ ఉండు నాయనా! అంది. ఓహో ఏదో తెస్తుంది. ఎందుచేతనో ఆలస్యం అయివుంటుందని మరో అరగంట కూచున్నాను. ఆవిడ రానేలేదు. ఆలస్యం అయిపోయింది వెళ్ళిపోతానండి అన్నాను. ఆఁ ఉండు బాబూ అంటూ వచ్చిందామె. ఇంతసేపూ మీరు ఉండమన్నారనే వున్నానండి అన్నాను. అదా! ఉండు అంటే వెళ్ళిరా అని అర్థంరా బాబూ! ఇవ్వాళ ఏమీ తినుబండారాలు లేవురా! అంది నవ్వుతూ.

వెల్లి దత్తాత్రేయులు (పోరి)★



# నేనూ—మారాజుగారూ

## ★ గ్రేస్ కెల్లీ ★

రైనీర్ రాజా మొనాకోకు మకుటమున్న మహారాజే అయినా, వెనుకటి రాజులకు మల్లే మూర్ఖత్వమూ, దర్పం, మొండి పట్టుదల చూపడు. ప్రజలకు సుఖం ఏ పన్నాగాల కలుగుతుందనుకుంటే వాటిని తనే అనుసరిస్తాడు.

మొనాకో ప్రజలు సంస్కార సంస్కృతులు కలిగి, అభివృద్ధి పొందే తీరులోనే అతని రాజ్యాంగ పథకాలన్నీ ఉంటాయి.

రాణి, రాజా—ఇరువురూ కూడా మొనాకో కొక ప్రత్యేకతను, ప్రశస్తిని తేవాలని ప్రయత్నిస్తారు. మాన్‌టెకార్లో 'ఓపెరా హౌస్' లో జానపద ప్రదర్శనలను వారు ప్రోత్సహించారు.

1950 సం. లో రైనీర్ రాజా ఉత్తమ సాహిత్యానికి సాలీనా 2000 డాలర్ల బహుమతులిచ్చే పథకాన్ని ఆవిష్కరించాడు. తొలిసారిగా ఈ బహుమానం అందుకున్న రచయిత జూలియన్ గ్రీన్ (అమెరికాలో జననం).

గ్రేస్ రాణి అయిన తర్వాత అధికారయుతంగా 1956 వ సం.లో మార్సెల్ బ్రియన్ అనే రచయితకు అవార్డును ఇచ్చింది.

రాజా ప్రారంభించిన సాహిత్య బహుమతుల పథకం లాంటిదే, సంగీతంలో రాణి ఒకటి ఏర్పాటు చేసింది. రెండు మూడు గంటలపాటు సాగే ఉత్తమ సంగీత కావ్యానికి ఆమె తరఫున 2000 డాలర్లు ఇస్తారు. ఇలాంటివే మర్రెండు అవార్డులతో కలిపి రాణి తరఫున 6000 డాలర్లు ఇస్తారు.

మొనాకోలో పారిశ్రామికమైన అభివృద్ధిని విపరీతంగా చేస్తున్నారు. పది—పన్నెండేసి అంతస్తుల మేడలు కడుతున్నారు. చాలా కట్టారు కూడా. కొండలు తొలిచి మైలున్నర పైగా పొడవుగా ఉండే సొరంగం తవ్వుతున్నారు. దీనిగుండా వేసే రైలుమార్గం ఇటలీ, ఫ్రాన్సుల నుంచి వచ్చేదవుతుంది.

ఈ సొరంగం తవ్వడంవల్ల వచ్చే కొండరాయినంతా సముద్రతీరాన పోస్తున్నారు. ఆవిధంగా ఏర్పడ్డ 20 ఎకరాల జాగాలో చాలా చక్కని పార్కు నిర్మించాలని సంకల్పం. ఆ జాగాలో ఇంకా 'విల్లాలు' నిర్మించవచ్చును.

మొనాకోకు గల ప్రధానమైన ఆదాయాలలో విలాస యాత్రికుల నుంచి వచ్చేది ఒకటి.

అది గ్రేస్—రైనీర్ వివాహంవల్ల మరింతగా ఎక్కువైందనే చెప్పాలి. గ్రేస్ పెళ్లయిన ఏడాది 1956 వ సం. లో ఈ రాబడి 18072 ఉంటే అదివరకు ఎన్నడూ 10671 దాటలేదు. అలాగే చిన్నచిన్న పరిశ్రమలు కూడా మొనాకోలో చాలా ఎక్కువయ్యాయి.

ఈ రాజ్యం ఆదాయంలో ఐదు శాతం మాత్రం కాసినో ద్వారా, గోల్ఫ్ క్లబ్ ద్వారా వస్తుంది. సెల్సుటాక్సు ద్వారా వచ్చే ఆదాయం రెండుముప్పావు శాతం ఉంటుంది. మొనాకో స్టాంపులు అంటే ప్రపంచం మొత్తంమీద 'స్టాంపులు' సేకరించేవారు మహా మోజు పడిపోతుంటారు.

రాణీ, రాజా కూడా అన్నీ ఎంతో చక్కని పథకాలు వేసుకుని కాని చేయరు. సాధారణంగా వారికి సంవత్సరారంభం సెప్టెంబర్‌లో ఉంటుంది. అక్కణ్ణుంచి మొదలు రాణిగారికి విందులనీ, వినోదాలనీ చాలా పార్టీలుంటాయి. ప్రారంభోత్సవాలు, అతిధిసత్కారాల లాంటి బాధ్యత లుంటాయి.

శీతాకాలంలోను, వసంతకాలంలోను ముమ్మరంగా పనులుంటాయి గ్రేస్‌కు. ఆమె ఆ సందర్భంలో ఎప్పుడేనా పారిస్‌కు ఏ థియేటర్‌కేనా వెళ్తూంటుంది కూడా.

ఫిబ్రవరిలో రాజదంపతులు స్విట్జర్లాండుకు వెళ్తారు. అక్కడ వారు నాలుగైదు వారాలు హాయిగా గడుపుతారు. అప్పుడప్పుడు రాణి అమెరికా వెళ్తూ ఉంటుంది న్యూయార్క్‌కు గాని,

57-వ పేజీ చూడండి



# ప్రపంచ ప్రముఖులు - 18

జోమో కెన్యటా ఈమధ్య (1961 ఆగస్టు 15 న) పదేళ్ళ కారావాసం, ప్రవాసం తర్వాత విడుదలైనాడు. కెన్యాలో సాగిన మావ్‌మావ్ దౌర్జన్య ఉద్యమానికి ఆయనే నాయకుడని బ్రిటిష్ అధికారులు అనుమానించి 1952 లో అరెస్టుచేశారు. అప్పటికి ఆయన వయస్సు 50; అప్పటికే కెన్యా ఏకైక నాయకుడుగా కేన్యటా పెద్ద పేరు సంపాయించు కున్నారు.

కెన్యటా అసలుపేరు కోమావ్ వా న్గెన్గీ. ఆయన చాలాకాలం బ్రిటన్‌లో వున్నాడు. బ్రిటిష్ వనితను పెండ్లాడాడు. వారికి ఒక కుమారుడు.

బ్రిటన్‌లో వున్న 13 ఏళ్ళలోనూ కెన్యటా అఖిలాఫ్రికా యూనియన్‌ను స్థాపించడానికి చాలా కృషి చేశాడు. ఇప్పుడు కూడా అఖిలాఫ్రికా సమాఖ్య నిర్మాణమే పరమాశయంగా పని చేస్తున్నాడు.

ముఖ్యంగా తూర్పు ఆఫ్రికా ప్రాంతాలన్నిటినీ కలిపి ఒక సమాఖ్యగా ఏర్పరచకపోతే, లాభంలేదని ఆయన అభిప్రాయం.

ఇది కెన్యాలోనే కొందరికి ఇష్టంలేదు. అక్కడి రాజకీయ పక్షాలు కొన్ని ఈవిషయంలో ఆయనను వ్యతిరేకించి పనిచేస్తున్నాయి.

ఏమైనా కెన్యాటా లేనకుండా కెన్యాలో ఏపనీ జరగదనే చెప్పవచ్చు: కారణం: ఆయన పుట్టిన కికుయు (ఆఫ్రికన్) జాతి అక్కడ అధికంగా వుంది. ఆజాతి మంచి పలుకుబడి గల్గిందికూడా. కాబట్టి కెన్యటాను ఆయన జాతినికాదని కెన్యాలో ఏమిజరిగినా ఆట్టేకాలంనిల్వాదు. అందుకే ఆయనతో తగాదా పడేవాళ్ళు కూడా (ఆఫ్రికన్‌లు) ఆయన్నే నాయకుడుగా అంగీకరిస్తూ వుంటారు. కెన్యా భవిష్యత్తు కెన్యటా మీదే ఆధారపడి వున్నదంటే అతిశయోక్తికాదు. ★



చిత్రరంగాని కెగిరిన రబ్బరు బంతిట! ఫొటో: రూప.

# అదృష్ట వరనాథ్ హరనాథ్

సముద్ర కెరటాలు ఉవ్వెత్తున్న లేస్తున్నాయి. ఆకాశానికి అర్రులు చాస్తున్నాయి; అందుకోలేక అంతలోనే దభీమని కూలిపోతున్నాయి. సముద్రపు ఒడ్డున వల్లగా వీస్తున్న పిల్లగాలులతో ఆడుకుంటున్న హరనాథ్ మనస్సు కూడా అట్లాగే ఉంది. తనలో లేస్తున్న ఊహలకూ, ఈ అలలకూ ఏమీ భేదంలేదు! ఈ అలల కలలూ, తన కలలూ ఒకలాగే ఉన్నాయి. సముద్రం మీదగా హరనాథ్ తన దృష్టిని చాలా దూరం సారించాడు. పైన ఉన్న ఆకాశమూ, క్రింద ఉన్న నీరూ ఎక్కడో—కలుసుకుంటున్నాయి. ఐతే, ఆకాశాన్ని అందుకుందామన్న సముద్రపు ఊహలు అక్కడ నిజమైనాయన్నమాట! .... అంతలోనే అతను చిన్నగా నవ్వుకున్నాడు. అది కేవలం భ్రమ! ఆ రెండూ ఎప్పుడూ కలుసుకోలేవు. దృష్టి చేస్తున్న అనేక మోసాలలో ఇదొకటి! అబద్ధాన్ని నిజంగా చూపించగలిగే సామర్థ్యం ఒక్క దృష్టికే ఉంది.

ఐతే దూరంగా కనిపిస్తున్న తన కలలు కూడా కల్లలే నన్నమాట! దూరంగా ఉన్న కొండలన్నీ నున్నగానే కనిపిస్తున్నాయన్నమాట! ఈ 'సినిమా ఛాన్సు' కూడా ఇంతేనా?—సినిమా ఛాన్సే కాదు.—ఏ ఛాన్సయినా అంతే.

బి. ఏ. పరీక్ష రాసి, వచ్చిన హరనాథ్ మెదడులో చాలా భావాలు—చాలా ఊహలు—చాలా ఉద్దేశాలు—తెరలు తెరలుగా, అలలు అలలుగా లేవసాగాయి. సినిమాలలో వేషాలు వెయ్యాలని అతను ఆశించాడు. అది సాధ్యంకాకపోతే ఆకాశంలో ఎగరాలని ఆశించాడు. ఎయిర్ ఫోర్సులో ఉద్యోగంచెయ్యడం అంటే ఎంత ఇష్టం ఉందో—సినిమాలో వేషం వెయ్యాలన్న ఇష్టమూ అంతే ఉన్నది. కనుచూపు మేరలో ఉన్నట్టే కనిపిస్తున్న 'సినిమా ఛాన్సు'—నింగీ నేలా కలిసినట్టుగానే కనిపిస్తున్నది. ఎయిర్ ఫోర్సులో ఉద్యోగం అంటే—పెద్దవాళ్లకు ఇష్టంలేదు. పెద్దవాళ్ల ఇష్ట ప్రకారం నడుచుకోవాలంటే—తాను ఇంకా పై చదువులు చదవాలి—ఏ ఆఫీసరో కావాలి! తనకు ఆ ఆలోచన లేదు; ఆఫీసరు ఉద్యోగంమీద అసలు ఆశలేదు! విమానదళం ఎంత ప్రమాదమైనదో, సినిమా కూడా అంత ప్రమాదమైనదే నని పెద్దలు ఉద్దేశిస్తున్నారు. తను ఊహిస్తున్న ఈ రెండు ఊహలలోనూ ఏ ఒక్కదాన్నీ కూడా పెద్దలు అంగీకరించడంలేదు!

హరనాథ్ చిరాగ్గా, చింతగా, కలతగా ఇసుకలో వాలాడు. అవతల ఆ సముద్రం ఎంత అల్లకల్లోలంగా ఉందో—ఇక్కడ అతని మనసూ అంత అల్లకల్లోలంగానే ఉన్నది. ఎటు మొగ్గటమో, ఏం తేల్చుకోవటమో అంతు చిక్కటంలేదు .... పెద్దవాళ్లమాట జవదాటరానిదే అయినా—అతని మనసుకు ఇష్టంలేని పనిని ఎన్నాళ్లని చెయ్యగలుగుతాడు? మానసికంగా అతనికి తృప్తి ఎక్కడ ఉంటుంది? ....

అతను లేచాడు—వొళ్లంతా దులుపుకొన్నాడు... సినిమా ఛాన్సును వెతుక్కుందామని బయల్దేరాడు. దొరికితే దొరుకుతుంది—లేకపోతే వైమానిక దళంలో చేరవచ్చును అనుకున్నాడు.

సినిమా ఛాన్సు రావటానికి అతనికి ఎంతో కాలం పట్టలేదు. ఆ 'ఛాన్సు'—మాల పట్టుకుని—ఎప్పట్నుంచో నిరీక్షిస్తున్నది. ఆ ప్రాంతాలకు హరనాథ్ రావటమే తడవు—అతని మెడలో ఈ హారం వెయ్యాలని చూస్తున్నది. కొద్ది రోజుల్లోనే అతను అటు వచ్చాడు—సినిమా ఛాన్సు అతన్ని వరించింది!

నవశక్తివారు 'మా ఇంటి మహాలక్ష్మి' తీస్తున్నారు. ఆ చిత్రంలో ఉన్న యువకుని పాత్రకు కొత్త అబ్బాయిని వేసుకుందామన్న ఆలోచన వాళ్లకూ ఉన్నది. ఆ చిత్రానికి కళాదర్శకునిగా పని చేస్తున్న సూరన్నకు హరనాథ్ తారసపడ్డాడు.

—49వ పేజీ చూడండి



విశాల ప్రొడక్షన్స్ వారి "మదన కామరాజు కథ"లో జయంతి.



గృహిణులు

# ఝలక్ ను మెచ్చుకుంటున్నారు

ఓహో, బట్టలు ఎంత మెరిసే తెలుపో! నిజంగా నీవు శ్రమపడుతున్నావు.

అహా, శ్రమకాదు నా అదృష్టం అనాలి. ప్రత్యేక విధానమున తయారైన ఒక కొత్త సబ్బును వాడుచున్నాను.

అంటే ఏమిటి?

ఏమిటనగా, ఈ సబ్బు త్వరలో సమృద్ధిగా నురుగునిస్తుంది. అది చాలా బట్టలను ... ఎంతో మెరిసే తెల్లగా ... ఎంతో సులభంగా ఉతుకుతుంది.

నిజం, ఈ కొత్త సబ్బు చాల బాగుగా శుభ్రపరుస్తుంది, అతేడా నేను కనిపెట్టేను.

అది సరిగా సామాన్య బారు సబ్బులకంటె, ఎక్కువగా చాలా కాలము నిలవుంటుంది, అంతకంటె ఇంకేమి కావాలి!

నేడే నేను ఈ సబ్బును కొనాలి. దాని పేరు ఏమిటి?

జ్ఞాపకముంచుకో, అది ఝలక్, నీకు మరి ఎక్కువ హామి ఏమిటనగా, దానిని బజార్లలో అమ్మకము చేయుచున్నవారు; మార్గదర్శక సంస్థ. గోద్రెజ్; సబ్బులలో ఉత్తమ నామము.




**ఉచితం:** ప్రతి ఝలక్ సబ్బుతో ఒక మనోహరమైన దువ్వెన

Godrej గోద్రెజ్ ఉత్పత్తి

ZA 4/8-62 (10"x3) TEL

## ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రకటనలు
## మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి

## వివిధప్రాంతాల వింతప్రదేశాలు-7

త్రాతల నాటినుంచి వుంటున్న వాటిలో తగాదాపడకుండా అమెరికానుంచి తెచ్చివేసిన సిందూరపు చెట్లు సహజీవనంచేస్తూ ఇంగ్లాండ్‌లోవున్న షేర్‌వుడ్ అరణ్యాలో పెరుగుతూవున్నాయి. పురాణకథల్లో అతిశ్రద్ధ తెచ్చుకున్న ఈ అడవి అందాని పెంపొందించేందుకని ఈ అమెరికన్ సిందూరపు వృక్షాలను పెంచుతున్నారు. ఎంతో లావుగా బారుగా కన్పిస్తున్న ఇంగ్లీషుజాతి సిందూరపుచెట్లుకు చుట్టుపక్కలున్న ఫ్యాక్టరీలు వాట్లోంచివచ్చే పొగవల్ల పెరుగుదల ఆగిపోయింది. అమెరికా జాతిచెట్లు మాత్రం, వాతావరణం అంత అనుకూలంగా లేకపోయినా, బాగా తొందర తొందరగా పెరుగుతాయని ఆ ఆడవి అజమాయిషీ చేసే అధికార్ల నమ్మకం.

కొన్ని వందలాది ఏళ్లుగా రాబిన్ హుడ్ స్వస్థలంగా పేరుపొందిన ఈ షేర్‌వుడ్ అరణ్యాలపైన మానవులు అధికారం, ఆక్రమణం సాగిస్తున్నా ఆ అరణ్యాలు ఇంకా పచ్చ పచ్చని చిక్కని చెట్లలో కన్నుల పండువా వుంటున్నాయి. అయితే చరిత్ర ప్రసిద్ధవీరుడు, బందిపోటు రాబిన్‌హుడ్, ఆతని అనుచరులు ఫలానిచోట తిరిగిఉంటారని అనుకున్న ప్రాంతంమాత్రం ఇప్పుడు కనపడదు. ఒకప్పుడున్న పెద్ద పెద్ద వృక్షాలకు చిహ్నాలుగా, ఉస్‌మని ధ్వనిచేస్తుండే సిందూర వృక్షాలు మాత్రం కనిపిస్తాయి.

ఇంగ్లాండులో పరిశ్రమలు ఎక్కువగావుండే నాటింగ్‌హామ్‌షైర్ దగ్గర సుమారు 100,000 ఎకరాల వైశాల్యంలో ఈ షేర్‌వుడ్ అరణ్యాలు వున్నాయి. నాటింగ్‌హాం షైర్‌ను ఉత్తర భాగాన వున్న అరణ్యాలులో కూడా రాబిన్ హుడ్ ఆ అని అనుచరులూ వీరోచిత సాహసిక కృత్యాలు చేసినట్టు చెప్పకుంటాడు

9 వ శతాబ్దంలో స్థాపింపబడిన ఆ నాటింగ్‌హామ్ పట్నం ఈ రోజుకు కూడా ప్రాచీన సంస్కృతికి సజీవ ప్రతిబింబంగా వుంది.

ఆ నగరానికి ఎగువలో ఉన్నతమైన కొండమీద ఉండే దుర్గం అన్నిటికన్న ముందే ఇట్టే ఆకర్షిస్తుంది. దాని 1697 లో నిర్మించారు. ఇప్పుడది స్థానిక మ్యూజియంగా ఉపయోగపడుతోంది.

నాటింగ్‌హామ్ షైర్‌కు షేర్‌వుడ్ అరణ్యాలమధ్య రోడ్డుమీద "న్యూస్టెడ్" ఆబే అనే ప్రముఖ ప్రదేశం వుంది. బైరన్ మహాకవి ఆ యింట్లో జన్మించాడు. ఏ కారణం వల్లనో ఆ మహాకవికి ఆ యిల్లంటే ఇష్టమున్నట్లు లేదు. ఇంటిచుట్టు ఉన్న చెట్లు నరికించటంలాంటి పనులు చేస్తూ అ భవనాన్ని ఎంత పాడుచేయాలో అంతా చేశాడు. కానీ ఆ ప్రాంతం; ఆ పరిసరాలు ఎంతో అందంగా, కన్నులపండువుగా ఉంటాయి; ఆ మహాకవిని క్షమించాయో ఏమో మరి!



మహాకవి బైరన్ ఇల్లు "న్యూస్టెడ్ ఆబే."

ఇక్కడి ప్రజల్లో రాబిన్‌హుడ్ అన్నా ఆతని అనుచరులన్నా ఎంతో నమ్మకం వుంది. పురాణ వ్యక్తిలాంటి ఆబందిపోటుకథను నమ్మకం లేనట్లు ఎవ్వరైనా పల్లెత్తుమాట అన్నా ఇక్కడి ప్రజలు సహించరు. రాబిన్‌హుడ్ కథ పూర్తిగా చారిత్రకమైన వృత్తాంతమని చెప్పలేకపోయినప్పటికీ, ఆధారాలు లేవని మాత్రం కొట్టివేయలేం.

రాబిన్‌హుడ్ కాలంలో ఈ షేర్‌వుడ్ అరణ్యం, రాజుల వేటకుగాను ప్రత్యేకించి వుంచి అందుకు సంబంధించిన శాసనాలు చేసేవారు.

ఈ ప్రాంతంలో అక్రమంగా ప్రవేశించి అందులో చెట్టు చేమగాని, గడ్డిగాములను గాని ముట్టుకుంటే కఠిన దండన విధించేవారు. రాబిన్‌హుడ్ కాలమనిచెప్పే 1160 లోనే ఇలా అక్రమ ప్రవేశ విచారణలు జరిగినట్లు చాలా దాఖలాలు ఉన్నాయి. రాబిన్‌హుడ్ 1247 లో చనిపోయాడనీ, ఆతని సమాధి యార్క్‌షైరులో ఉందనీ అంటారు. కాని చాలామంది వ్యతిరేకులు, పేదలకోసం ధనికులను దోచిన ఆ బందిపోటు రాబిన్‌హుడ్ కథ బాలెట్‌లనుండి ఆ కాలంలోపుట్టిందే గానీ వాస్తవం కాదంటారు. ★

# హరివంశము

## ఉజ్జయినీపర్వం-1

దారుకుడు ఉజ్జయినికివచ్చి రెండుదినములైనది.

ఆ రెండు దినములలోనను మహారాజు జయత్సేనునకును, వానికిని పెద్ద స్నేహమైనది. ఆ రెండు దినములలో వామాక్షికిని, మిత్రవిందకును కొన్ని జన్మల స్నేహము పునరుద్ధరింపబడి, క్రొత్తలేక ప్రవర్తింపబడినట్లు ఉన్నది. ఇక్కడ రాజాధి దేవికి ఒక్కటే విచారము. ఆమెకు ఇద్దరు పుత్రులు. ఒకడు విందుడు, మరియొకడు అనువిందుడు. వారికి తన మేనబావయన్నచో ఇష్టములేదు. మహారాజు ఈ విషయమును తనతో నప్పుడప్పుడిట్లనుట గూడ యున్నది.

"ఓసి ! రాజాధిదేవి ! ఒక్క కుంతీమహాదేవిని తీసివేయుము. తక్కిన మీ అక్కా చెల్లెండ్రేమి మగబిడ్డలను కన్నారే ! మరియు ఆమె దత్తు పోయినది గనుక అట్లు లుండినదేమో" అనును.

అవును. తన అక్కగారు శ్రుతదేవ యున్నది. ఆమెను తమ తండ్రి శూరసేనుడు కారూశాధిపతియైన వృద్ధశర్మకు ఇచ్చి చేసినారు. వారికి ఒక మగబిడ్డ. వానిపేరు దంతవక్త్రుడు. వానికిని తమ యన్నగారి బిడ్డలైన రామకృష్ణు లన్నచో పడదు. పడుట లేదని బంధుగు లందరును చెప్పుకొను చున్నారు.

మరి శ్రుతకీర్తి యున్నది. ఆమెను కేకయరాజు ధృష్టకేతుడు పెండ్లి యైనాడు. ఆమె వలన ప్రతర్దనాదులైన పుత్రులను బడసినాడు. వారికిని శ్రీకృష్ణ బలరాములన్న గిట్టదనియే రాజాధి దేవి విన్నది.

ఇక దమఘోషుని పుత్రుడైన సునీధుని సంగతి చెప్పనే అవసరములేదు. వీడు శ్రుతశ్రవస బిడ్డడు. వీనికిని శ్రుతదేవ బిడ్డడు దంతవక్త్రునకును ఎక్కడలేని మైత్రి యనియు చెప్పుచున్నారు. రామకృష్ణుల ఉపనయనమునకు వచ్చి ఈ సునీధుడేమి యాగడము చేసినాడు! విచిత్రమేమనగా ఈ సునీధుని మగధేశ్వరుడైన జరాసంధుడు పెంచుకొనినాడు. వానిని శిశుపాలుడు అనినాడు. తన సేనలకు వానిని సేనాపతిని చేసినాడు. రామకృష్ణుల మధ్యయు, తమ అక్కా చెల్లెండ్ర బిడ్డల మధ్యయు విరోధములకు కారణ మీ జరాసంధుడు కాడు కదా ! మహారాజు ఈమధ్య నొకసారి చెప్పినారు. శిశుపాలుడు విందానువిందుల వద్దకు దూత నొకనిని పంపినాడట. తాము అనగా జరాసంధాది సుక్షత్రియ యోధులు ఒక మహా కార్యమును తలపెట్టుచున్నారట. అందులో చేరుట మీకు గూడ ఇష్టమా ! అని. మహారాజ దూతను చూచి మందలించి "వీ డెవడురా ! పిల్లకాకి ! కోకిలముగా వ్యవహరించుచున్నాడు" అని శిశుపాలుని గూడ మందలించి ఆ దూతను పంపించివేసినారట.

ఇన్నియు తలంపునకు వచ్చి రాజాధిదేవి యనుకొన్నది : అవును, మహారాజు అన్నమాటలో తప్పేమి యున్నది. మా అక్కా చెల్లెండ్రము, పెద్దయక్క కుంతీమహాదేవి వినా, ఇట్టి బిడ్డలను కనినాము. మరి మా పెద్ద అక్కయో ! ఆమె కష్టములకు పుట్టినిల్లు. భర్తయేమో ముని శాపగ్రస్తుడై పోయినాడు. సవతి యేమో ఇద్దరు బిడ్డలను కని, అక్క చేతిలో పెట్టి, సహగమనము చేసినది. అక్క బిడ్డలు ముగ్గురును, సవతి బిడ్డలు ఇద్దరును. వీరి నిప్పు డందరును పంచపాండవు లనుచున్నారట. ఏక గర్భమున పుట్టినట్లుందురట అందరును. తాను వారిని చూడలేదు. మహారాజు మాత్రము చూచినారా ! చారులవలన వినినారు. వారు తండ్రి మరణానంతరము తల్లితో హస్తినకు వచ్చియున్నారనియు మహారాజు చెప్పినారు. పాండవులకు రామకృష్ణులనిన అమిత భక్తియట. మరి తమ ఈ మగబిడ్డ లిట్లగుట యేలో!

"మహాకాళ ! మహాకాళ ! ఏమి విచిత్రమయ్యా ఇది! అన్న వసుదేవునకునూ, వదిన దేవకికినీ మాయందు అమితమైన ప్రేమయు, గౌరవమునా ! మరి మేమును వారిని దేవతల నూచినట్లు చూతుమా ! మా భర్తలును వారియందు భక్తిని నెరపుచుందురా ! మరి ఈ మగబిడ్డ లిట్లయి రేమయ్యా తండ్రీ !"

అంతలో మిత్రవిందయు, వామాక్షియు నచ్చటికి వచ్చిరి. రాజాధిదేవి కూతును మిత్రవిందను ప్రేమతో దగ్గరకు తీసికొన్నది. — ఈ కుమార్తె ఒకర్తు తన మేనబావను ప్రేమ చేయుచున్నది— అనుకొన్నది. ప్రకాశముగా "ఏమి ! తల్లీ ! వామాక్షియు, నీవును, మహాకాళనాథుని చూచుటకు పోవుదు మన్నారు గదా ! ఇటులు వచ్చిరేమి ! నన్ను గూడ రమ్మందురా !" అన్నది.

వామాక్షి పకాలున నవ్వినది.

"వదిన ! చెప్పుము. చెప్పుము" అన్నది.

"పోవే ! వామాక్షి ! నీవు చెప్పుము" అన్నది. సిగ్గు పడినది.

"ఎందుకండీ ! వదినగారు ! అట్లా సిగ్గు పడుతున్నారు. అన్నగారు కలలో కన్పించారా ! వదినగారి కన్నుల్లో నిల్చారా ! ఎందుకండీ వదినగారు ! అట్లా సిగ్గుపడతారు' అన్నది వామాక్షి.

ఇప్పుడు మహారాణి రాజాధిదేవికి గూడా నవ్వు వచ్చినది. ఈ వామాక్షి యేమి విచిత్రమైన పిల్ల. వచ్చి రెండు రోజులు కాలేదు. ఆ రెండు రోజులలో పిల్లనేమి స్నేహము చేయుచున్నది. ఇంటిలోనను తలలోని నాలుకవలె మెలగుచున్నది. మరియు ఆమెను, ఆ సుదామునితో దారుకుడు తీసుకొని వచ్చుటయే విచిత్రము. పౌండ్రకుడేమో తల పెట్టగా నిట్లు రావలసి వచ్చినదనినాడు దారుకుడు. మరి ఇచ్చటికే ఏల రావలయును ! తాను దారుకుని ఒకటి రెండుసారు లడిగినది. వాడు చెప్పలేదు. మహారాజు నడిగినది. ఆయనయు చెప్పలేదు.

'ఓసి ! రాజాధిదేవి ! ఇవి నీవు ఇప్పుడు తెలియవలయు విషయములు కావు. తరువాత చెప్పెదను" అన్నారు.

ఆ తరువాత నాయన ఈ రెండు దినములలో తిరిగి అంతఃపురములకే రాలేదు. ఏవో రాచకార్యములు కొట్టుకొని పోవుచున్నట్టు లున్నవి ! ఈ దారుకుడు ఒకడు ! వాడు తాను ఏమి అడిగినను నవ్వును. మందహాసము చేయును. మౌనము వహించును. "ఏమిరా ! నీకును మా మహారాజుగారి జాడ్యము పట్టినదా !" అని తాను అనగా, వాడు నవ్వుటయు కాదు, తల గూడ ఊపెను. అప్పుడు తనకును నవ్వు వచ్చినది. తానును నవ్వినది. "ఏమిరా ! దారుక ! విషయ మేమిరా !" అన్నది. వాడు "తల్లీ ! నేను చెప్పవలయునది కాదు" అనినాడు.

ఇప్పుడు ఈపిల్ల లేమో వార్తను వేసుకొని వచ్చినారు. ఆమె తన అంకమున నున్న కుమార్తె చుబుకమును నిమిరి, అలకలు సరిచేసి, "తల్లీ ! ఏమిటి వామాక్షి చెప్పుమనుచున్నది" అన్నది.

మరల మిత్రవింద సిగ్గుపడినది. మరల వామాక్షి నవ్వినది.

"మహారాణి !"

"ఎవరు వారు ?"

"నేను కంచుకిని."

"ఏమి కంచుకీ ?"

"మహారాజు వేంచేయుచున్నారు."

అన్నంతలో జయత్సేనుడు అంతఃపురములో ప్రవేశించినాడు. రాజాధిదేవిని చూచి అదియొక విధముగా మందహాసము చేసినాడు.

"దేవి !"

రాజాధిదేవికి ఆశ్చర్యము వేసినది. మహారాజు తన్ను ఎప్పుడు "ఓసి ! రాజాధిదేవి" యనియో, "ఓసి ! రాజు" అనియో, లేక "ఓసి ! రాజాధి" అనియో సంబోధించును. నేడు విచిత్రముగా ఆయన తన్ను "దేవి" అనుచున్నారు. ఆమెకు నిజముగా నవ్వు వచ్చినది. నవ్వినది.

"ఏమి ! ప్రాణనాథ !" అన్నది.

మహారాజు విరుగబడి నవ్వినాడు. "ఓసి ! వసుదేవుని చెల్లెల ! ఓసి ! శ్రీకృష్ణుని మేనయత్త ! దేవకి కనిన నల్లనిమేనివానిని చూచినావు కదటే ! వాడు మన రాజ్యమునకు వచ్చుచున్నాడే, వచ్చుచున్నాడు. ఆచార్య సాందీపనితో కలిసి వచ్చుచున్నాడు. నేను అప్పుడు—అనగా ఎప్పుడు ?—మనము కాశికి పోయియున్నప్పుడు చెప్పితిని గదా ! ఆ పౌండ్రకుడు ఆచార్యుని కాశికయం దుండనీయడని—ఆ నామాట నిజమైనది. ఆచార్యులు వచ్చుచున్నారు. అయ్యా ! తమరు ఆవంతికులు. ఉజ్జయినీ వాసులు. తమ ఆశ్రమము ఉజ్జయినియందుండవలయు నంటిని—అప్పుడు ఆచార్యులు మంద

—55 వ పేజీ చూడండి

# యువతులా - ఉద్రేకాలా

మారుతి

నేడు స్త్రీలన్ని రంగాల్లోను పాల్గొంటున్నారు. అన్ని రంగాల్లోను ధైర్యంచేసి ముందుకొచ్చి, విజయం సాధిస్తున్నారు. కాని ఒక్క ప్రక్రియకు మాత్రం లొంగిపోయి, దానినుండి తప్పించుకొనలేక, దాని కాహుతయి పోతున్నారు. ఈ విధంగా ఆహుతయిన వార్ని దృష్టిలో పెట్టుకొనే ఈ వ్యాసం వ్రాయడం జరుగుతున్నది. ఇది కేవలం ఊహ మాత్రం, ఊసుపోకు వ్రాసిందికాదు. ఇలాంటివార్ని కండ్లారచూసే.

అన్ని స్వాతంత్ర్యములతో బాటు భారతీయులు 'ప్రేమ' స్వాతంత్ర్యముకూడ పొందినట్లుగా నేడు కనిపిస్తుంది. యువతీ యువకు లొకరి నొకరు ప్రేమించుకోడం. తత్ఫలితంగా స్త్రీ పురుషునికి లొంగిపోవడం, లోకనిందల పాలవడం, తరువాతేమీ యెరుగనట్లు పురుషుడు స్త్రీజీవితం నుండి తప్పుకోవడం, యేటూ దారి, తెన్ను తెలియక చివరికి స్త్రీ ప్రాణాలు తీసుకోవడం జరుగుతోంది. పోనీ విద్యాహీను లిలా ప్రవర్తిస్తున్నారేమో అంటే, చదువుకున్నవారు, పరిస్థితుల నర్థంచేసుకోగలవారు దానినుండి రానున్న విపత్తు నర్థంచేసుకోగలవారే (అందరు కాకపోయినా) ఇలా ప్రవర్తిస్తున్నా రంటే నేటి విజ్ఞానం యేం కావాలి? 'ప్రేమ'అనే పదానికుండే పవిత్రతనే రూపుమాపి, దాన్నొక విషబీజంగా తయారు చేశారు. స్త్రీ అంటే సామాన్యురాలుకాదు. ఒక యింటికి గృహిణి, ఒక సంసారం సృష్టించడానికి మూలకారకురాలు. మూణ్ణాళ్ళ జీవితంలో నిండు యౌవ్వనంలో భవిష్యత్ గూర్చి యెన్నో పసిడి కలలు కనడం సహజం. ఆ కలలు పండే శుభఘడియ రాకుండానే దీపాన్ని చూసి, భ్రమించి చేరబోయే కీటకం దాని కాహుతయినట్లు, ఈ ప్రేమ కాహుతవుతున్నారు. ఇలాంటివార్ని చూస్తే కొంచెం సేపు, జాలి, విచారం వేస్తుంది. కాని అంతలోనే కోపం ముంచుకొస్తుంది. ఎందుకు? దీన్ని వారికి వారుగా తెచ్చుకున్నది గనుక. ఈ ప్రపంచంలోకి ఆడ, మగ ఒకే విధంగా వచ్చినప్పటికీ, పెరుగుదలలో ఉంటుంది తేడా. మగవాని బాధ్యతలకన్నా ఆడవారి కమితమైన బాధ్యత లుంటాయి. మగవాడు పసితనంనుండి పండుముసలి వరకూ యెలా తిరిగినా అడిగేవారుండరు. అధమం కొన్నాళ్ళు చెప్పుకున్నా దానివల్ల, అతని జీవితం నాశనం కాగల పరిస్థితి యేర్పడదు. పసితనం యెలా గడిచినా తన బాధ్యతలను గుర్తెరిగి, కట్టుదిట్టంగా మెసలగల వయస్సు 14 సం. రాలనుండి స్త్రీకి ప్రారంభ మవుతుంది. అప్పటినుండి బాధ్యతగల ఒకరి కర్పించేదాక ఆ పిల్ల నెంతో బరువుగా చూస్తారు తల్లిదండ్రులు. యెందుకు? స్త్రీ ఉన్నత స్థానానికి పోయినా, పతనం అయినా ఈ యౌవ్వన సమయంలోనే. యిప్పుడే గనక బుద్ధి వక్రించిందా, వారి జీవితం ముళ్ళబాటే. అందుకే చిన్నతనంలో తలిదండ్రులు, పెండ్లయాక భర్త, స్త్రీకి ప్రహరీ గోడవంటివారు.

పూర్వం స్త్రీ పరపురుషుని కన్నెత్తి చూస్తేనే తప్పు పట్టేది లోకం. కాని నేటి పరిస్థితులనుబట్టి స్త్రీలు హైస్కూలు మొదలు యూనివర్సిటీ వరకూ, ఆఫీసుల్లోను, యెటుచూసినా మగవారితో కలిసి పనిచేయడం, మాట్లాడటం, కలిసి మెలిసి తిరగడం తప్పదు. ఇలా తిరగడం తప్పని కాదు. కాని అక్కడే స్త్రీ తనయొక్క వ్యక్తిత్వాన్ని నిలద్రొక్కు నిగ్రహశక్తిని చూపించి, వారిని తగు మోతాదులో ఉంచి, తన మనసుకి కళ్ళెంవేసి, నిగ్రహించవలసిన కాలం. అలా చేసిననాడే స్త్రీ తన ఆశయాలు నెరవేర్చుకో గలదు. తను చూసేదంతా జ్ఞానదృష్టితో చూడాలి. తన మనసుకి తట్టినదంతా ఆత్మపరిశీలన చేసుకోవాలి. మనసు చెడ్డ తలపెట్టినా ఆత్మ యెప్పుడూ వద్దనే చెబుతుంది. ఆత్మ నెప్పుడైతే నిర్లక్ష్యం చేశారో అప్పుడు అధోగతి తప్పదు.

స్త్రీ జీవితం కుసుమంవంటిది. చెట్టుకు పూచి, మధుర పరిమళాలు వెదజల్లుతూ, అందాలు చిలకరిస్తున్న కుసుమాన్ని త్రెంచి వాసనచూసి, నలిపి, తన సహజత్వాన్ని పోగొట్టుకోగానే మనం చేస్తున్నదేమిటి? అవల విసరేస్తాం. అలాంటిదే స్త్రీ జీవితం. యేమాత్రం తన బాధ్యతలను మరచిపోయినా, నిర్లక్ష్యంచేసినా వాడిన కుసుమమే అవుతుంది. బాధ్యతయిన ఒక పురుషుని కర్పితం అయేవరకూ తన్ను తాను రక్షించుకుంటూనే ఉండాలి. జడవస్తువుకనుక పుష్పం మన బారినుండి రక్షించుకొనలేక పోతుంది. మనం ప్రాణులం కనుక లొంగే శక్తి, తప్పించుకొనే శక్తి స్త్రీ మనసు నిహిత ఆధారపడుంటుంది. మనసు మానవాధీనంలో ఉండాలి కాని మానవులు మనస్సాధీనంలో ఉండకూడదు. అలా యెప్పుడైతే, మనస్సాధీనంలో నడుస్తారో, అప్పుడు వారి జీవితం కళ్ళెంలేని గుర్రంలా తయారవుతుంది. అందులోను, స్త్రీ (యువతి) యెల్లప్పుడూ జీవిత రథాన్ని సాఫీగా నడప దలచుకొన్నా నా మనసుకు కళ్ళెంవేసి, నిగ్రహించి, యెందరు పురుషుల ఎదుటనైనా తన స్త్రీత్వాన్ని మరవక, తన బాధ్యతలను గుర్తెరిగి, తనకు తాను హాని చేసుకోకుండా, తనకు సంబంధించిన వారిని నవ్వులపాలు చేయక మెసలగలిగిననాడే తన ఆశయాలను నిరాటంకముగా తీర్చుకోగలదు.

క్షణికోద్రేకాలకు లొంగిపోవడం ఫలితం తెలియవచ్చాక వారిని ప్రార్థించడం, వారు కాదనడం, తత్ఫలితంగా తన ప్రాణాలేగాక అంతర్గర్భితమైన యింకొక ప్రాణాన్ని మొదట్లోనే నాశనం చేయడం, ఇన్ని సంభవిస్తున్నాయి. భగవంతుడిచ్చిన ప్రాణాన్ని భగవంతుడే తీసికొన్ననాడు వారికి లోక సానుభూతెప్పుడూ ఉంటుంది. లేనిచో వారిమీద జాలిచూసే వారికన్నా నిందించేవారే అధికంగా ఉంటారు.

అయితే దీనిలో పురుషుని బాధ్యతేమీ లేదా? అనుకోవచ్చు. కేవలం లేకపోలేదు. ఈ బరువుబాధ్యత లిరువురిమీద వున్నాయి. మనసు చంచలమైనది. అందులోను స్త్రీ మనసు అతి బలహీనమైనది. అందుచేత స్త్రీ యిటువంటి బలహీనతకు లోనవుతున్నప్పుడు పురుషుడు కొంచెం దీర్ఘదృష్టితో ఆలోచించి, తప్పుకుని, నెమ్మదిగా బుద్ధిచెప్పి, పంపిస్తే స్త్రీజాతి నుద్ధరించిన వారవుతారు.

అందరు ఆలాగే ఉంటారా? అవొచ్చు. అందరి మాట నేను వ్రాయడంలేదు. అలా జరిగిన వాళ్ళని దృష్టిలో పెట్టుకొనే అని మొదటే వ్రాశాను. అయినా యౌవ్వనం పొంగు వంటిది. అది యెప్పుడు పొంగుతుందో చెప్పలేము. ఈనాడు లేనిబుద్ధి రేపు రావచ్చును. ఈనాడున్నది రేపు వక్రించవచ్చును. అందుకే ఇది దృష్టిలో ఉంచుకొని మెసలవలసిన కాలం యువతీ యువకులకు. కోరికలు చంపుకోవాలా? అంటే యెండమావులవల్ల దాహం తీరదు కదా? రాచబాటమీద నడవడం చాలా తేలిక కాని గతుకుల బాటమీద గురితప్పకుండా నడవడమే గొప్ప. 






# వనితావాణి,
ఆంధ్రసచిత్రవారపత్రిక,
7, తంబుచెట్టివీధి,
మద్రాసు-1

## అందం నేర్చుకుంటే వస్తుందా?

5—10—62 సంచికలో కృష్ణప్రియ వ్రాసిన "అందం నేర్చుకుంటే వస్తుందా?" అనే వ్యాసము చాలా బాగుంది. నిజంగా ఆడవారు ఒకరు వేసుకున్నవి తాము వేసుకోవాలని కోరుకుంటారు. కాని తమకు ఏది అందాన్నిస్తుందో అని ఆలోచించరు. ఈ వ్యాస రచయితకు నా అభినందనములు.

పి. ఎస్. వీణ (తిరుపతి)

## పిల్లల విషయంలో....

విజయలక్ష్మిగారు రాసిన వ్యాసం చాలా బాగుంది. మా బాబులు విషయం చెపుతున్నాను. వాళ్ళ నాన్న గారు డాక్టరు. వాడు కూడా మందులు ఇస్తాను అని అంటాడు. అస్తమాను స్టెతస్కోపు, మందుల పెట్టె పట్టుకొని నేను డాక్టరును అంటాడు. వారన్నట్టు ఏ గూటి చిలక ఆ గూటి పలుకు. విజయలక్ష్మిగార్కి నా హృదయపూర్వక అభివందనాలు.

శ్రీమతి ద్విభాష్యం బాలాత్రిపురసుందరి (వైజాగ్)

## మనమూ - మన మాటల తీరూ

కాకుమాను భారతిగారు వ్రాసిన "మనమూ—మన మాటల తీరు" అనే వ్యాసం బాగుంది. నాకో స్నేహితురాలుంది. ఆమె ఎక్కువగా చదవలేదు. పెళ్ళి అయింది. నేను 'ఎస్సెల్సీ' పాసై, టీచర్ ట్రయినింగ్అయి, వుద్యోగం చేస్తున్నాను. ఓరోజు ఆమె మా యింటికి వచ్చి మాటల సందర్భంలో, "కట్నాలిచ్చి, పెళ్ళి చెయ్యలేని తలిదండ్రులు, ఎలాగో చదివించి, ఆడపిల్లలు సంపాదిస్తుంటే తింటూ కూర్చుంటారు" అంది. ఆ మాట వినగానే నా మనస్సు బాధపడ్డది. నాకు యింకా పెళ్ళి కాలేదు. అప్పట్నుంచి ఆమెఅంటే నాకు అసహ్యం. ఎదుటి మనిషిని యిలా మాటిపోటి మాటలతో దూషిస్తే వీళ్లకొచ్చే ఫలితమేమిటాఅని విస్తుపోతుంటాను.

యద్దనపూడి జయలక్ష్మి (గుంటూరు)

* * *

భారతిగారు వ్రాసిన "మనమూ మన మాటల తీరు" అనే వ్యాసం చాలా బావుంది. మాటలతీరుని బట్టి ఎదటివారి హృదయం ఎల్లా గాయపడుతుందో చాలా బాగుగా విశదీకరించారు. ఒక్కోసారి అనుకోకుండా మన మాటలచే ఎదటివారికి బాధ కల్గించవలసివస్తుంది. ఆటుతరువాత మన తప్పు తెలుసుకొని బాధపడ్తూ యుంటాం. అందుకనే కాలు జారినచో తీసుకొనవచ్చును. కాని మాట జారినచో మరి తీసుకొనలేం అనిపెద్దలు అంటారు.

నిర్మల్ (వీరఘట్టాం)

* * *

సోదరి కాకుమాను భారతి వ్రాసిన మనము—మన మాటల తీరు వ్యాసం నన్ను బాగా ఆకర్షించింది. ఎదుటివారిని బాధపెట్టటంలో ఉండే ఆనందం (కొంతమంది ఆఫీసర్ల భార్యలకు) ఎందులోనూ ఉండదనిపిస్తుంది. ఎదుటివారితో ఆప్యాయంగా మాట్లాడితే పోయేది ఏమీలేదు. బాధ పడేటట్లు చేస్తే వచ్చేది ఏమీలేదు. కాని చాలామంది ఆఫీసర్ల భార్యలు ఇది ఎందుకు గుర్తించరో తెలియటంలేదు. ఆఫీసర్ భార్యననే హోదా తప్పితే వ్యక్తిగతంగా వారికి ఉండే హోదా ఏమీలేదు.

కుమారి కౌండిన్య

* * *

పిల్లిమాటలు చెప్పి కాలం గడిపేకంటే విలువైన మాటలతోనే మనస్సు వెన్నపూసలా కరగించాలి. రచయిత్రిగారు వ్రాసిన ఉదాహరణలు చాల బాగున్నవి. మాటల తీరు మగువలు నేర్చుకోవాలి.

మరువాడ వెంకటరమణమ్మ (కాశీబుగ్గ)

## పురుషులూ - పాకశాస్త్రమూ

పురుషుడు అన్నవాడు భార్య ప్రతికోర్కెను తీర్చాలా? అందులో యుక్తాయుక్తములులేవా? మనకు ఏమైనా కోర్కెలు ఉన్నయెడల కష్టము లేకుండా తీర్చుకుంటూ అవసరం అయితే ఆకోర్కెను మనమేగాని త్యాగము పురుషులను మాత్రం మనము చేయమనకూడదు. అలా కానిచో బాధలు మనకే తప్పవు. మగవారి యిష్టానుసారంపోతే మనకు సుఖముగా ఉంటుంది.

వి. శారదా శ్రీరామమూర్తి (కండ్లగుంట)

* * *

మా ఇంటి ప్రక్కవాటాలో ఒక తమిళకుటుంబం ఉండేది. ఆ ఇంట్లో మగవారు, ఆడవారికి ఎంత చేయూతగా ఉంటారో వ్రాస్తే మీరు ఊహించలేరు. ఇద్దరూ చదువుకోలేదు. గంపెడు సంతానం. ఆమె ఎప్పుడయినా వీలు చూసుకుని సినిమాకు వెళ్లేది. ఆ ఇంటాయిన. అన్నం వడ్డించుకుని ఇల్లంతా కడిగి పాలుతోడేసి. పిల్లలను నిద్రపుచ్చేవారు. పెళ్లిళ్ళ పేరంటాల సమయంలో రెండువందల అతిధులకు నిమిషంమీద అన్నం ఆలస్యం లేకుండా వడ్డించేవారు. ఆమె మా ఇంట్లో వాళ్లని ఎగతాళిచేస్తూ తన భర్త పిల్లల గురించి చాలా గొప్పగా చెపుతుండేది.

ఇదిగాక నాకు మరింత ఆశ్చర్యం కలిగించింది, మా వదినగారి సంసారం ఆమె ఢిల్లీ విశ్వవిద్యాలయంలో లెక్చరర్. ఆమె భర్త పైలట్ ఆఫీసరు ఏనాడూ పట్టుదలలూ. పంతాలులేకుండా ఇంటిపనులలో సహాయం చేసుకుంటూ పిల్లలతో నెగ్గుకు వస్తున్నారు. అలా ఉంటే వారిద్దరిమధ్య అనురాగం ఇనుమడిస్తుంది కూడా.

సరోజ (పాకాల)

* * *

విజయ సుబ్రహ్మణ్యంగారి "పురుషులు—పాకశాస్త్రము"వ్యాసం చాలా బాగుంది. పూర్వకాలంలో విద్యకు పురుషుడు, వంటకు స్త్రీ అని ప్రత్యేకించేవారు. కాని ఇప్పుడు స్త్రీలు బాగా చదువుకుంటున్నప్పుడు పురుషులు మాత్రం ఎందుకు వంట చేయకూడదు? ఈ అభిప్రాయాన్ని రచయిత్రిగారు చాలా బాగా విపులీకరించారు. స్త్రీ, పురుష భేదములు లేకుండా వంట నేర్చుకొనుటలో తప్పు లేదు. అత్యవసర సమయములందుతప్ప స్త్రీలు పురుషులచేత వంట చేయనివ్వరు. ఈ కాలంలో పురుషులేకాదు, స్త్రీలుకూడా వంటచేయడమనేది డిగ్నిటీకి లోపంగా తలుస్తున్నారు.

కుమారి వి. వరలక్ష్మి (నెల్లూరు)

* * *

7—9—62 పత్రికలోని "పురుషులూ—పాకశాస్త్రము" వ్యాసం ఒకవిధముగా బాగుంది, బాగులేదు. అయినా స్త్రీలు పుట్టింది ఉద్యోగాలు చేయడానికి, సంసారం దిద్దడానికి కావచ్చు. కాని ముఖ్యముగా తన ఇల్లు దిద్దుకోవాలి, భర్తను సంతోషపరచాలి. మాకు తెలిసిన ఒకామె 8వ తరగతి చదువుకుంది. ఆమె ఇంటిపట్టున ఉండక

మహిళామండలికి వెడుతుంది. భర్త ఎప్పుడైనా సినిమాకు వెళ్లడానికి తయారవుతుంటే "ఎటూ వెళ్లేది" అ!" అని అంటుంది. కాని నేననేది పురుషులు ఆఫీసులో అడ్డచాకిరి చేసి విశ్రాంతికొరకు ఇంటికి వస్తే వంట చేయమంటారా? అయినా పురుషులు ఆడవారికి వంటలో సహాయం చేయాలి! (కూరలు తరగడమో, గంజివార్చడమో, చారులో పోపు పెట్టడమో) పేపరు చదువుతూ "ఏమాయె? ఏమాయె?" అని మా బావగారిలా అనవద్దు.

కొత్తపల్లి రాజరత్నం (భిక్కనూరు)

విజయ సుబ్రహ్మణ్యంగారు వ్రాసిన పురుషులూ — పాకశాస్త్రమూ అను వ్యాసం చాలా బాగుంది. భర్త తన శ్రమను చూడలేక సహాయపడుతుంటే, ఆ స్త్రీ హృదయంలో ఎంత అనురాగం, ఆనందం, కృతజ్ఞతా నిండిఉంటాయో చెప్పలేము. అటువంటి దాంపత్యం ఇతరులకు ఆదర్శవంతంగా ఉంటుందనడంలో సందేహంలేదు. కాని కొంత మంది స్త్రీలు—ఉద్యోగమూ, చదువూ లేనివాళ్లు కూడా గృహకృత్యాలను సోమరితనంతో చేయక! ఆఫీసులో చాకిరీచేసివచ్చే భర్తలచేత చేయించడం శోచనీయం. శంకర్‌గారి బొమ్మలు చూపి వేసినట్లు అనటంలేదు. నిజంగా చూశాను. ఇటువంటివారు కొంతమందే ఉండవచ్చును. వారు ఆ విధముగా చేయడం అనుచితమని నా ఉద్దేశం. ఇటువంటివారి గురించి రచయిత్రి వ్రాయలేదు.

అరణి లీల (విజయవాడ)



## కుమారి కళ - 6    బొమ్మలకథ    దేవిక

శివరాం మొదట కచేరీకి రానన్నాడు. తరువాత ఒప్పుకున్నాడు. ఇద్దరూ వెళ్లారు. కచేరీ జరుగుతూండగా.

చాలాబాగుంది... మంచికచ్చేరి సుమా! మీకు బాస మీద ఇష్టం లేపోయినా యిది బాగుందిగా..

నీ కోపం చూసి నేను నిజంగా నువ్వా టికెట్లను తీసుకుని చింపేస్తావేమోనని భయపడ్డాను.. కానీ కచేరీకి వచ్చావు థాంక్స!

ఇంటర్‌వెల్‌లో అనుకోకుండా భూషణంగారు అగుపించారు. కళ ఆశ్చర్యపోయింది. ఆయనే వచ్చి పలకరించారు.

ఏం కళా! ఈ గానసభ బాగుంది కదూ! ఏం... ఇంకేం? యిద్దరూ వచ్చారుగా... సంతోషం.

మరేం.... ఎంతో బాగుందండీ! మీరు వస్తారని నాతో మాట మాత్రమేనా అనలేదే?..

అదిసర్లే గాని... యిదుగో యితనే మా శివరామ్ గారు!...

ఓ హో! అలాగా! చాలా అదృష్టవంతుడు సుమా!... శివరామ్ గారూ! మన కళకు త్వరలోనే గొప్పకీర్తి వస్తుంది తెలుసా?... 'కచేరీ' అవగానే మీ యిద్దరూ నాకు అతిథులుగా రావాలి సుమా! తప్పదు

కాని శివరామ్ మాటలు కళకు నచ్చలేదు. ఆమె తన భవిష్యత్ గురించి భూషణం ఏమి చెప్తాడా అని ఆశపడుతున్నది.

గానసభ అయ్యాక....

భూషణంగారెంతో మంచివారు కదూ! శివరామ్! మనల్ని ఎంతో అభిమానిస్తున్నారు కదూ! ఆయనతో భోజనం చేస్తాము

కాదు కళా! మనం యింటికి పోదాం. ఇదంతా చూస్తే అతను సరియైనంగా ప్లాను వేసి చేశాడని తెలియడం లేదా?

తప్పకుండా భూషణంగారు నాకు సాయం చేస్తాడు. నన్ను గొప్పదాన్ని చేస్తాడు....

నిజంగా! కళా! నేను నీ పాట తొలిసారి వినగానే నీ ప్రతిభను గుర్తించాను. ప్రతిభకు రాణింపు వచ్చేలాగా చూడటమే నా విధి... నాకు ఇష్టం కూడా....

తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక
సర్క్యులేషన్ అత్యధికమైనది.

డా॥ గాలి బాలసుందరరావు

# ఉదర పరీక్ష: స్పర్శన

ఉదరమును స్పృశించి పరీక్షిస్తున్నప్పుడు తెలుసుకోవలసిన మొదటి విషయము ఉదర కుడ్యము యొక్క బిగుతు. ఫుట్‌బాల్ బ్లాడరులో గాలికొట్టి, దానిని నొక్కినప్పుడు చేతి వ్రేలు ఎలా పైకి తన్నబడుతుందో అదే విధంగా ఉదర కుడ్యమును నొక్కినప్పుడు చెయి పైకి తన్నబడుతుంది. ఉదరమును నొక్కుతున్నప్పుడు ఒక రకమైన ప్రతిఘటన పరీక్షకుని హస్తమును ఆపివేస్తుంది. ఉదరకుడ్యమును నొక్కి చేతిని తీసివేయగానే, నొక్కిన భాగము సొట్టబడి ఉండక వెంటనే పైకి వచ్చేస్తుంది. అంటే దీనికొక అకుంచనీయత (Elasticity) ఉంటుందన్నమాట. ఇది ఆరోగ్యస్థితిలో కనుపించే విషయము. కొన్ని రోగ పరిస్థితులలో ఉదరకుడ్యము ప్రతిఘటనము అధికం కావచ్చును. లేక ఉదర మధ్యంలో నొక్కిన చోట సొట్టలు పడవచ్చును. ఈ అకుంచనీయత అధికమైనప్పుడు ఆ ఆధిక్యత ఉదరకుడ్యం అంతటిలోనూ ఉన్నదా ? లేక ఏదో ఒక ప్రదేశంలో మాత్రమే ఉన్నదా అని గమనించాలి. నొక్కితే లొంగుతున్నదా ? లేక బల్లలాగా అసలు నొక్క డానికే వీలులేకుండా ఉన్నదా అనీ గమనించాలి. పెరిటోనైటిస్ అనే వ్యాధిలో రిఫ్లెక్సుగా ఉదర మధ్యంలో ఉండే కండరములు బిర్రెక్కి ఉంటవి, ఈ ప్రతిఘటన స్థానికంగా ఉన్నప్పుడు, ఆ స్థానంలో పెరిటోనియం మాత్రమే ఇన్‌ఫ్లేం అయిఉన్నదని గానీ, ఆ ప్రదేశంలో ఉండే భాగములు ఇన్‌ఫ్లేం అయిఉన్నవని గానీ మనం గ్రహించవచ్చును. ఆరోగ్య స్థితిలో ఉదర స్పర్శనం ఏ బాధా కలిగించదు. కొందరికి చక్కిలిగింత పెట్టినట్లు ఉండవచ్చును. కాని ఏ ప్రదేశంలో నైనా బాధను రోగి అనుభవించినప్పుడు ఆ ప్రదేశం పరిమితిని నిర్ణయించడం అవసరం. అలాగే బాధారహితమైన స్థానిక ప్రతిఘటన ఉదరంలో ట్యూమరువల్ల కలగవచ్చును. నాభికి ఇరుప్రక్కలా స్తంభముల వంటి నిర్మితులుంటవి. అవి రెక్టస్ కండరములు. కొందరిలో అవి చాలా కఠినంగా ఉంటవి. ఆ కండరములుండే ప్రదేశములలో ప్రతిఘటన ఆ కండరములవల్ల కలిగిందో లేక వేరే కారణంవల్లనే కలిగిందో తెలుసుకోడం కష్టం. అప్పుడు రోగిని తల ఎత్తమంటే ఆ కండరములు మరీ బిగుసుకుంటవి. అప్పుడు ఆ కాఠిన్యత ఆ కండరముల వల్లనని తెలుస్తుంది.

ఉదర ప్రదేశంలో ఏదో కణితి ఉన్నదని అనుమానం కలిగినప్పుడు అది ఉదర కుహరం (Abdominal cavity) లో ఉన్నదా, ఉదర కుడ్యంలో (Abdominal wall) ఉన్నదా నిర్ణయించాలి. కణితిమీద ఉన్న ఉదరకుడ్యమును అటూ యిటూ ఆడించి చూస్తే అది కణితిని అంటిఉంటే కదలదు. అంటివుండనప్పుడు తేలికగా ఉదరకుడ్యమును కదిలించవచ్చును. కాని కొన్ని పరిస్థితులలో ఉదరకుడ్యం లోపలివైపుకూ, ఈ నూతన దుర్మాంస వృద్ధులకూ మధ్య కొన్ని తోళ్ల వంటి. నిర్మితులు ఏర్పడి వాటిని అతికిఉంచుతవి. ఇలా ఏర్పడిన అతుకులను ఇంగ్లీషులో 'ఎడ్‌హిషన్‌సు' అంటారు. కణితి చిన్నదయినప్పుడు, బొటనవ్రేలికీ ఇతర వ్రేళ్లకు మధ్య దానిని పట్టుకొని ఆ కణితి క్రిందికి వ్రేళ్లను పోనివ్వాలి. అప్పుడు కణితి క్రింద వ్రేళ్ళు కలుసుకుంటే అది ఉదర కుడ్యంలోనే ఉన్నదనీ, ఉదరకుహరంలో లేదనీ గ్రహించవచ్చును. ఉదరకుహరంలో ఉన్న కణుతులకు ఉదరకుడ్యం అతికి ఉండడం ఆ కణితి చాలా ప్రమాదకరమైనదని తెలుపుతుంది. కొన్ని నూతన వృద్ధులు పెల్విస్‌లో—అంటే ఉదరం క్రిందివైపున బేసిన్ వంటి ప్రదేశంలో ఆరంభమవుతవి. కాని అలా 'పెల్విస్' లో ఆరంభించిన కణుతులూ, సిస్టులూ (Cysts)—అంటే నీటి బుగ్గల వంటి నిర్మితులు—పెల్విస్‌లోనే ఉండిపోవు. కొన్నింటికి కాడలు ఉండి, ఆ కాడల చివర ఈ బుగ్గ వంటి నిర్మితి ఏర్పడుతుంది. అప్పుడవి పెల్విస్‌లో ఆరంభించినా, ఉదరభాగంలో తేలుతూ ఉంటవి. ఈ నూతన వృద్ధి ఉదర సంబంధమైనదో, పెల్విస్‌కు సంబంధించినదో తేల్చుకొనడానికి అరచేతి అంచును నాభికి అంగుళం క్రిందుగా, ఉదరానికి అడ్డంగా ఉంచి నెమ్మదిగా అదిమితే అనుభవం ఉన్నవారు నూతన వృద్ధి ఎక్కడనుంచి వస్తున్నదీ తేల్చుకోవచ్చును. ఆ తర్వాత ఆ బుడగ నీటితో నిండిన బుగ్గలాగా ఒకచోట నొక్కితే మరొకచోట ఉబ్బుతూ ఉంటున్నదా, లేక టొమేటో పండులాగా నునుపుగా మెత్తగా ఉన్నదా, లేక మారేడు పండులాగా నునుపుగా గట్టిగా ఉన్నదా తేల్చుకోవాలి. ద్రవపదార్థంతో నిండిన సంచీవంటి నూతన వృద్ధిమీద రెండు మూడు వ్రేళ్లు ఉంచి ఒక వ్రేలితో దానిని నొక్కితే, మరొక వేలు పైకి త్రోయబడినట్లుగా ఉంటుంది. ఆ లక్షణాన్ని ఆంగ్ల వైద్య పరిభాషలో ఫ్లక్చుయేషన్ (Fluctuation) అంటారు. ఏబ్సెస్‌లు పక్వమైనప్పుడు ఈ లక్షణం వాటిలో ఏర్పడుతుంది.

నూతన వృద్ధి కదులుతున్నదని తెలుసుకొన్నప్పుడు, అది ఏ ప్రక్కకు కదులుతున్నదో గమనించాలి. ఉఛ్వాస నిశ్వాస సమయములలో అది ఏ దిక్కుకు కదులుతున్నదో, అసలు కదలనే లేదో గమనించాలి. స్టెర్నం క్రింది మొనవద్ద కొన్ని వ్యాధులలో పీల్చినప్పుడు ఒక గుంట ఏర్పడి, ఆ గుంట లోపలికి పీక్కుపోతున్నట్లుగా ఉంటుంది. శ్వాసబంధనం ఏర్పడే ఉబ్బసం, డిఫ్తీరియా వంటి వ్యాధులలో ఈ లక్షణం ఉంటుంది. లివరు, స్ప్లీనులలాగా డయాఫ్రమ క్రిందివైపున ఉన్న ఉదరాంగములకు సంబంధించిఉన్న నూతన వృద్ధులు, శ్వాసకాలంలో శ్వాస చలనములతోపాటుగా కదులుతూ ఉంటవి. అదేవిధంగా కడుపూ కదులుతూ ఉంటుంది. కిడ్నీలకు సంబంధించిన నూతన వృద్ధులు శ్వాస సమయంలో చాలా కొద్దిగా చలిస్తవి. మిగతా ఉదరాంగములకు సంబంధించిన నూతన వృద్ధులు శ్వాసకాలంలో చలించవు.

రోగి స్థితి అనుకూలంగా ఉన్నప్పుడు రోగిని హఠాత్తుగా ఊపితే ఉదరంలో నీరుంటే, నీరు తొణికిన శబ్దమును వినవచ్చును. జఠరాశయంలో చాలా నీరూ, గాలీ ఉన్నప్పుడు గాలి పైకిపోయి నీరు ఒక మట్టంగా ఉంటుంది. ఆ సమయంలో రోగిని ఊపితే, జఠరాశయంలో నీరు కదలిన చప్పుడును వినవచ్చును. ఆ కదలికను రోగి కూడా గమనించవచ్చును. పేగులలో నుంచి బలవంతంగా గాలి బయటికి పోయినప్పుడు ఆ గాలి ఆ స్థానంలో ఉండే ద్రవపదార్థాలగుండా ప్రవహించి గుడుగుడు శబ్దాన్ని కలిగిస్తుంది. అప్పుడు పరీక్షకుని చేతి క్రింద గులకరాళ్ళు కదులుతున్నట్లు ఉంటుంది.

నాభి స్థితిని ముఖ్యంగా గమనించాలి. లివరుకు సంబంధించిన కేన్సరులో ముమ్మొందుగా వ్యాధి క్రిమి ప్రవేశించే ప్రదేశం నాభి. అప్పుడు నాభి అటూ ఇటూ కదలదు. అది చాలా కఠినంగా ఉంటుంది. లివరులో కేన్సరు ఏర్పడినప్పుడు ఈ లక్షణం తరుచు కనుపిస్తూ ఉంటుంది. కొంతమందిలో కొన్ని రోగ స్థితులలో రోగిని, పసిడా బిడ్డలా పడుకోబెట్టి ఉదరమును పరీక్షించినప్పుడు గాని, రోగ స్వభావం తెలుసుకోడం కష్టం.

స్పర్శన పరీక్షకూడా అనుభవం గడించుకున్నవారు చేసి, ఆరోగ్య స్థితిలో లేని దేదయినా కనుక్కున్నప్పుడు అది డాక్టరు దృష్టికి తేవడం మంచిది.

ఇక స్పందన మార్గంలో పరీక్షించ దలుచుకున్న ప్రదేశంమీద చేతి వ్రేళ్లను పరచి ఒక్కొక్క వ్రేలినే మరొక వ్రేలుతో కొట్టినప్పుడు వినబడే శబ్దంస్థాయిని బట్టి చాలా సంగతులు తెలుసుకోవచ్చును.

ఒక డ్రాయరుమీద వ్రేళ్లతో కొట్టినప్పుడు అన్నిచోట్లా శబ్దం ఒకే విధంగా ఉండదు. కాళ్ల మీద కొట్టినప్పుడు ఒకమాదిరిగానూ, బల్ల మధ్య ఒకమాదిరిగానూ ఉంటుంది. బల్ల మధ్య డండం అనే శబ్దం వస్తుంది. కాళ్ళమీద డబ్‌డబ్ అనే శబ్దం వస్తుంది. అలాగే ఒక పాత్రలో సగా

—42 వ పేజీ చూడండి

## జరిగిన కథ

నిచుల నగరంలో శృంగారమంజరి రెండవ కుమార్తె హేమసుందరిని అర్ధరాత్రి కలుసుకొనవచ్చి రంగనాయకుడు, కావలివారిని గాయపరిచిపోతాడు. మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకుల రహస్యం హేమసుందరిని వలచిన తన ప్రియుడు తిరుమలరెడ్డికి చెబుతుంది. రంగనాయకుడు, హేమసుందరికోసం ఆలయ గోపురంమీదకిపోయి రెడ్డి పంపిన సింహాచలాన్ని ఎదుర్కొని బలమైన గాయాలతో ఇంటికి చేరుకుంటాడు. తిరుమలరెడ్డి ద్రోహం తెలుసుకున్న మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకులు కలుసుకునే ఏర్పాటు చేస్తుంది. నాంచారమ్మ సాయంతో రంగనాయకుడు హేమసుందరిని కలుసుకుంటాడు. తిరుమలరెడ్డి ఇంట్లో దొంగతనం జరుగుతుంది. రంగనాయకుడు, హేమసుందరి శ్రీరంగం పారిపోతారు. హేమసుందరి కన్యగాదని రంగనాయకుడు తెలుసుకుంటాడు. తనని గాయపరచవచ్చిన సింహాచలాన్ని చంపివేస్తాడు. విశాలనేత్రాల మొక్కు చెల్లించి వస్తుండగా హేమసుందరీ రంగనాయకులకు రామానుజ యతీంద్రుల దర్శనం కలుగుతుంది. రంగనాయకులకోసం యతీంద్రులు కబురంపుతారు.

## 13

ఆ మరునాటి ఉదయం శ్రీరంగంలో పలు మూలల నల్లనల్లని మబ్బు లలముకొన్నాయి. పెనుగాలి వీచి ఇళ్ళ కిటికీల తలుపులు టపటప కొట్టుకున్నాయి. వీధులలో పెద్ద గాలి దుమారం చెలరేగింది. పండుటాకు లువ్వెత్తుగా పైపై కెగిరి ఇళ్ళ కప్పులమీద తూలిపడ్డాయి. క్రమక్రమంగా పెద్ద జడివాన ప్రారంభించింది. ఇంచుమించుగా రెండు జాముల పొద్దు తిరిగేదాకా దాని హోరు తగ్గలేదు. ఆ తరవాత క్రమక్రమంగా ఆ జడివాన కొంచెం తగ్గుముఖం పట్టింది. కాని మధ్యమధ్యన జల్లులు పడడం మాత్రం మానలేదు. చూరులోనించి చుక్కలొకటే జారిపడి నేలమీద చిన్నచిన్న గుంట లేర్పడ్డాయి. రంగనాయకుని ఇంటి పెరటిలో పూలమొక్కల బారులు వానలో బాగా తడిసి తలలు వంచుకొన్నట్టు కనిపించాయి. వీధిలో వర్షధార లేకమై చిన్న చిన్న కాలవలై నలువైపుల గలగల ధ్వనులతో ప్రవహించాయి. ఇంటికప్పుమీద పడుతున్న వాన చినుకుల సవ్వడి మంద్ర మంద్రంగా రంగనాయకుని హృదయంలో మారుమోగింది.

మధ్యాహ్నం నిద్రలేచిన తరువాత రంగనాయకు డింకొకసారి ధర్మకర్తకోసం బయలుదేరాలని అనుకొన్నాడు. తలవనితలంపుగా ఎడతెగని

—43వ పేజీ చూడండి



# విశాలనేత్రాలు

పి. గణపతి శాస్త్రి




"ఒరే రామూ"

..................

"ఒరేయ్ రాముడూ......"

..................

"రా......ము......డూ......"

గాఢనిద్రలోఉన్న రామారావు ఉలిక్కిపడి లేచాడు. ఎదురుగాఉన్న గోడ—గడియారం పన్నెండుంబావు చూపిస్తోంది.

కళ్లు నులుపుకుంటూ, "ఏవిటి బాబాయి" అన్నాడు. మాటల్లో నిర్లక్ష్యమూ, విసుగూ ప్రతిధ్వనిస్తున్నాయి.

"కాసిని మంచినీళ్లు ఇవ్వరా......ప్రాణం పొయ్యేటట్లుంది......" అన్నాడు మూలుగుతూ రాఘవయ్యగారు.

"మంచినీళ్లు......నీ బొందనీళ్ళు......ఆ వెధవ ప్రాణం పోయినా బాగుణ్ణు" అని లోపలే అనుకొని, "ఆ, తెస్తున్నా......" అని లోపలికి పోయి, మంచినీళ్లు తెచ్చి ఇచ్చాడు.

అప్పటికి నెలరోజుల్నించి రాఘవయ్యగారు గుండెజబ్బుతో బాధపడుతున్నారు. వయస్సు తక్కువేమీకాదు. డెబ్భయి దాటేసయ్. అయినా, మనిషి దృఢంగా, పొట్టిగా పొన్నకాయలాగా ఉంటారు.

రామారావు రాఘవయ్యగారి అన్నకొడుకు. తల్లీ తండ్రీ చిన్నప్పుడే చనిపోతే, తనకూ నా అన్నవాళ్ళు లేకపోవడంవల్ల రాఘవయ్యగారే తనింటికి తెచ్చి పెంచి, పెద్దవాణ్ణి చేశారు. ఎమ్మేదాకా చదువు చెప్పించారు. తన తదనంతరం తన యావదాస్తి రామారావుకు చెందేటట్లు వీలునామా వ్రాశారు.

తెల్లవారింది.....

ఉదయం ఎనిమిదింటికల్లా డాక్టరు వచ్చాడు యథాప్రకారంగా.

పరీక్షా అవీ కానిచ్చి బయటకొచ్చిన తర్వాత

—4? వ పేజీ చూడండి

# సరాగమాల

వి ఎ కె రంగారావు

## గుప్తస్వరం:

"మహామంత్రి తిమ్మరుసు"లో మొదట బుర్ర కథ ఎవరెవరు పాడారో తెలుసా! తెరమీద రాజశ్రీ, వల్లం నరసింహారావు, కె. ఎస్. రెడ్డి. తెర వెనుక? పి. లీల, వల్లం నరసింహారావు, మిక్కిలినేని రాధా కృష్ణమూర్తి. ఈసారి సినిమా చూసినపుడుగాని, రికార్డు విన్నపుడుగాని గమనించి వినండి. వారి వారి కంఠాల పోలికలు తెలుస్తున్నవేమో!

పాఠకులకు జవాబులిచ్చేముందు చిన్న సూచన. సరాగమాల గురించి వ్రాసేటప్పుడు, మీ ఉత్తరాలు, లేఖల శీర్షికలో ప్రచురింపబడటానికి ఉద్దేశింపబడినవైతే, ఎడిటర్‌గారికి వ్రాయాలి. అలాకాక కేవలం నా గురించే ఉద్దేశింపబడినవైతే నా పేరుకే పత్రిక ఆఫీసుకి) వ్రాయండి. ఇవి లేఖల శీర్షికలో ప్రచురింపబడవు. నలుగురికీ ఆసక్తివుండే విషయాల గురించి ప్రశ్నిస్తే, వాటికి పత్రికాముఖంగా, సరాగమాల శీర్షికద్వారా జవాబులివ్వటం జరుగుతుంది.

హనుమకొండ హేమచందర్‌గారికి: మీరన్నట్లు లలిత సంగీతపు రికార్డులను పరిచయం చేయడం నాకూ ఇష్టమే. కాని, నేడు విడుదలవుతున్న ప్రైవేటు రికార్డులలో ఎన్నిటి సంగీతం నిజంగా లలితంగా ఉంటున్నదని ప్రశ్న! మంచివాటినన్నిటిని విడవకుండ పరిచయం చేస్తున్నాను. అలాగే చెడ్డవాటినన్నిటినీ విడవకుండా విమర్శించమని మీ ఆదేశమా! అస్తు.

మీనవిల్లూరు సత్యనారాయణమూర్తిగారికి: "రాజమకుటం"లో "అంబా జగదంబా" రికార్డుగా విడుదలైనది. జి. ఇ. 32752. రెండవప్రక్క "సడిసేయకోగాలి" అను కృష్ణశాస్త్రి సాహిత్యం. నేను కూడా మంచి సంగీతాన్ని అందివ్వగలను అని వేణు నిరూపించుకోగలిగిన కొద్ది పాటలలో ఇవి రెండు. "ఇద్దరు మిత్రు"ల్లో "సీతాకోకచిలుక" పాట అంత ప్రజాదరణ పొందక పోవటానికి కారణాలు చిత్రం విడుదలైన కొన్నాళ్ళకు గాని రికార్డుగా రాక పోవటం. రెండవది: ఆ పాటకు నాట్యంగాని, వరుసలుగాని ఉండవలసినంత ఆకర్షణీయంగా లేక పోవటం.

తునినుంచి వ్రాసిన కోకా భానుమతిగారికి: ఒకోసారి పాట రికార్డు చేసిన తరువాత కారణాంతరాల వలనగాని, సెన్సార్ను టిఫిన్ చేయడం (డాన్సు పాటలంటే వీరికి భలే ఇష్టం) వలనగాని సినిమాలో ఆ పాట ఉండకపోవచ్చు. "నీవు వెలిగించు", "కుంకుమరేఖ" లో లేక పోవటానికి పై రెండింటిలో ఏదో ఒక కారణమై ఉంటుంది. ఆ చిత్రంకోసం రికార్డు చేసిన పాట ఎందుకు ఊరికెనే అట్టిపెట్టి ఉంచడమని ఆలోచించి, నిర్మాతలు రికార్డుగా విడుదల చేసి ఉంటారు. చేయగా మీరు వినిఉంటారు.

"చెంచులక్ష్మి" సినిమాలో, "చిలకా గోరింక" "చెప్పు లెక్కగలవా" పాడింది ఘంటసాల, జిక్కి. బాగా ప్రజాదరణ పొందినవని తెలుసుకొని సరస్వతీ స్టోర్స్‌వారు నిర్మాతల అనుమతి తీసుకొని తమ కళాకారులగు శ్రీనివాస్, సుశీలలతో పాడించి విడుదల జేశారు. వైజాగ్ కృష్ణగారికి: అవును. నాకూ తెలుసుకోవాలనివుంది.

### సంగీత సమీక్ష

"దక్షయజ్ఞం" చిత్రంలోని కొన్ని పాటలు రికార్డులుగా ఈ మధ్యనే వచ్చాయి. ఈ చిత్రానికి సంగీత దర్శకులు సాలూరు హనుమంతరావు. హిందీ సంగీత దర్శకుల కృతులను అనుసరించబోయి పౌరాణిక చిత్రాల్లో గిటార్ ధ్వనులతో ఆధునికతను ధ్వనింపజేయ బూనినపుడు వీరు ఉప్పులేని ముద్దపప్పులో కాలేసినట్లు ఉంటుంది. తమ స్వంత ప్రతిభను చూపించి తమ స్వంత శైలిని వినిపించినప్పుడంతా అత్యంత మధురంగా, రసభరితంగా, లలితంగా ఉంటుంది. పూర్తిగా తను స్వంత శక్తిమీదనే ఆధారపడి చేసిన మెచ్చతగ్గైన పాటలను పరిచయం చేస్తాను.

### దక్షయజ్ఞం GE 35322

ఒకే రాగాన్ని ఆధారం చేసుకొనకపోయినా, క్షణానికొక రాగచ్ఛాయను చూపుతూ గంభీరంగా ఉండని పాటలు రెండు—సుశీల పాడినవి. "కోయిలా తెలుపవటే కోరిన జతగాడు రానే రాడా, కొసరుచు మనసార లాలించడ"—ఆరుద్ర సాహిత్యం. లేకపోతే అంత చిలిపి వలపుల తలపులు వేరొకరు ఒక పల్లవిలోనే పొదిపి పెట్ట గలరా! "కోయిలా" అన్నపుడు సుశీల గాత్రంలో పలికిన సంగతి వింటుంటే తీయని ఊహలతో మనస్సు తిమ్మిరెక్కిపోతుంది. "తాను నను కోరడా, కోరి దరిజేరడా" అని ప్రశ్న. లే బంగారు తీగలు సాగుతున్న కంఠంతో అలా ప్రశ్నిస్తుంటే రాడా, రాక మానగలడా!

రెండవప్రక్క "కమనీయం కైలాసం". ఈ పాట ఎక్కడ విన్నా ఆ ప్రదేశం కమనీయంగా కైలాస సమానంగా తోపింపజేసే శృంగారసృష్టి. అందులోనే "తీయని తొలిరేయి తెలియని హాయి" ఉన్నది. "తేనియ చిందే కెమ్మోవి తావి" ని తలపించే మధురిమ మాత్రం సుశీల కంఠంలోనే ఉన్నది. వేణువు లీలగా వినబడుతున్న వాద్య రచన, శృంగార భక్తిభావాలు సరసంగా సమ్మిశ్రితం జేసి, శ్రోతల మనసుల దొంగిలించే ఆరుద్ర రచన, తేనెనాకలాంటి హనుమంతరావు వరస, ఈ పాటను ఉత్తమ శ్రేణిలోకి చేరుస్తాయి.

### దక్షయజ్ఞం N 697

పి. లీల కంఠంలో అన్ని విధాల పాటలు బాగున్నా, కొంచెం శాస్త్రీయ వాసనలు ఉన్నవి మరీ పరిమళిస్తాయి. "నీ పాద సంసేవ దయసేయవా, నిజభక్త మందార సదాశివా" అన్నది యమన్ రాగంలో వినేవారిని ఇట్టే ఆకర్షించే సంగతుల సంపదతో, ఆరుద్ర అందమైన మాటల పొందికతో అలరారుతున్నది. రెండవ ప్రక్క సూరిబాబు పాడిన బృందగీతం. చిత్రంలో ప్రమథగణాల స్తోత్రం. సూరిబాబు కంచు గాత్రం ఇంచుమించు అందరికీ తెలిసినదే. కొందరికి నచ్చినదే. కాని బృందం మధ్య మధ్య అందుకొన్న చరణాలు గొడవగా ఉండి పాటకు ఉన్న కొద్దిపాటి అందాన్ని చెడగొట్టినవి. "పలు పాపాల శాపాల హుంకారం" అనే చరణంతరువాత వినవచ్చే బృంద ఘోష నిజంగా ఆ హుంకారంలాగానే ఉన్నది.

### దక్షయజ్ఞం N 69741

ఈ చిత్రంలో ఇంద్రసభ దృశ్యంలో ఒక పోటీ నృత్యం ఉన్నది కదా. చిత్రీకరణ సరిగా లేక, నాట్యం ఆ కారణంగా ఉద్ధృతంగా ఉన్నందువలనా సినిమా చూస్తుంటే ఆ నాట్యంతోబాటు వినబడిన రాగమాలిక అంత రాణించలేదు. విడి రికార్డు వింటుంటే ఆ దరువులు, స్వరాలు గమనిస్తుంటే భేష్ అనాలనిపిస్తున్నది. పల్లవి మొదట చరణం "నవరస భావాలు" షణ్ముఖప్రియ రాగంలో ఉన్నది. ఇది పాడి మెప్పించటం కష్టసాధ్యమని పండితులు ఉవాచ. "లలిత శృంగార లావణ్యశోభ" అన్న చరణం కాంభోజి రాగం. జనశ్రేణులకు అనాదిగా ప్రియమైనది. భైరవి నున్నది "వలపుల శాంతరస మొలికించగలవ" అన్నది. ఆఖరి చరణం "బీరము లాలించు పెడసరపు భామా" తరుచు వినపడే మోహన రాగం. ప్రతి చరణాన్ని వేరే రాగంలో పాడించి వేరే రాగంలో ఉన్న పల్లవిని అంత రమ్యంగా అందుకొనేటట్లు రాగ రచన చేసిన హనుమంతరావు అభినందనీయులు. స్వర రచన కూడ జటిలంగా శాస్త్ర పరిజ్ఞానాన్ని తెలుపుకోవటానికి స్ఫటికంలా ఉంది. దరువుల వడి కొంతవరకు అందాన్ని కొరవడించినా ప్రౌఢత్వాన్ని ఇనుమడింప జేసినదనే చెప్పవచ్చు. ఇందులో కొంత పసుమర్తి చేర్పు కూడా ఉన్నది. మొదటనే పకడ్బందీగా వరసను కూర్చుకొనుట వలననూ, పాడిన ఒకరి కంఠంలో తమిళ ఛాయలు ద్యోతక మవుతున్నందువలననూ సాహిత్యంలో కొంత డబ్బింగ్ వాసన వస్తున్నది. రికార్డు మొదట వినిపించిన కంఠం రాజనాలది. రచన ఆరుద్ర.

ఆరుద్రగారి సంగతే మరొకమాట. వారు చాలా సినిమాలలో కనపడ్డారట. "ప్రేమలేఖలు" "అవన్" (తమిళం) లో సెక్రటరీగా, "కన్నతల్లి" లో స్టూడెంటుగా, "పరోపకారం" లో తమ స్వంత రచనకు ఘంటసాల కంఠంతో పాడుతూ ఒక బిచ్చగానిగా, "ముందడుగు" లో కార్మిక సంఘం కార్యదర్శిగా, "మాధవి" (తమిళం) లో వీధినాట్యం వీక్షించే ప్రేక్షకునిగా దర్శన మిచ్చారట. ఈ విషయాలు నటులు రమణమూర్తి తెలిపారు. ★



## జరిగిన కథ

రామచంద్ర పురవాస్తవ్యుడు ప్రసాద రావుగారి కుమార్తె, నిర్మలకు అజంతా విహారాలు చూచేందుకు సహోధ్యాయినులతో వెళ్తూండగా త్రోవలో కారు చెడిపోయి ప్రయాణంసాగక బాధపడుతున్న ఓ లెక్చరర్ దంపతులతో పరిచయం ఏర్పడుతుంది. ఆ లెక్చరర్ భార్య రుక్మిణమ్మగారు నిర్మలకు తన అక్కగారి కుమారుడు ప్రకాశ్‌తోను, వసంతకు వేట్లపాలెంలోని బడిపంతులుతో వివాహం జరుగుతుంది. ప్రకాష్ మేనత్త కుమార్తె వసుధ సుధాకర్ అనే వ్యక్తిని వివాహం చేసుకున్నందువల్ల ప్రకాశ్ ఇంట్లో రేగిన కల్లోలం సమసిపోతుంది. నళినీ, కుసుమలకు కూడా ప్రసాదరావుగారు వివాహాలు చేస్తారు. కోడంటికం భరించలేని కుసుమను భర్త అనుమతిలో ప్రసాదరావుగారు ఇంటికి తీసుకువస్తారు.

## 6

ప్రకాశ్ తెల్లవారి ఎనిమిది గంటలకంతా వెళ్లటం చీకటి పడుతుండగా ఇల్లు చేరటం మామూలై పోయింది.

లెక్కలు రిసెర్చి చేస్తున్నాడు. తీరిక ఉండటం లేదు. నిద్ర లేచింది మొదలు, పడుకునేవరకు, ఇంకా చెబితే కలల్లో గూడ లెక్కలేస్తుంటాడు. ఇంటిల్లిపాదీ ఇంత దీక్ష పనికిరాదని చెప్పి చూచారు. రాజారావుగారు కొడుకు మనసు మార్చాలని ఎంతో ప్రయత్నించారు. కానీ లాభంలేకపోయింది.

ప్రకాశ్ బాగా తెలివి గలవాడు. థీరెమ్స్‌ను క్రొత్త క్రొత్త పద్ధతులతో నిరూపించటం, క్రొత్త విషయాలను కనుగొనటంలో ఆసక్తి అతన్ని బంధించినై. అతని ఆలోచన లెప్పుడు లెక్కలమీదే ఉంటున్నాయి.

నిర్మల అతని మనసును కాసేపు లెక్కలమీద నించి త్రిప్పేందుకు స్వర్ణలతను భర్త కిచ్చేది. పాప తన ఆటపాటలతో, ముద్దు ముచ్చటలతో తండ్రిని సంతోషపెట్టి మనస్సుకు విశ్రాంతి నిస్తుందని భావించేది. కాని ప్రకాశ్ పాపతో ఆడుకున్నట్లే ఆడుకుని గభుక్కున పాప నందించేసి, ఆ దగ్గర్లో ఏ కాగితం దొరికితే దాన్ని తీసుకుని వ్రాసేస్తుండేవాడు.

ఆమె హృదయంలో తుఫాను రేగింది. ఇది ఏమిటి ? నెలనెల గడిచేకొద్దీ భర్తలో ఈ మోజు ఎక్కువై పోతుంది. ఇంటిల్లిపాది కలవరపడ్డారు. రాజారావుగారు నిద్రపోలేక అలా ఆలోచిస్తూ జాగరణ చేసేవారు.

ప్రకాష్ రిసెర్చి పూర్తికావచ్చింది. అతని పని ఎంతో ఉన్నత స్థాయిలో ఉన్నట్లు, అఖండమైన కీర్తిని సంపాదించవచ్చునని అందరూ అనుకోవటం ప్రారంభించారు. ప్రకాశ్ స్నేహితులు, అతని గైడ్సు కొందరు రాజారావుగారి దగ్గర ప్రకాశ్‌ను పొగిడేవారు. అంతటి జ్ఞానం గలవాణ్ణి కన్నందుకెంతో గర్వించదగ్గ విషయం. కానీ .... కానీ ....

కానీ ......

రాజారావుగారు దుఃఖంతో కృంగిపోయారు. ఆయన హృదయం దిగులుతో నిండిపోయింది. అవ్యక్తమైన బాధతో తల తిరిగి పోతుంటే ఒంటరిగా తలుపేసుకుని ఘొల్లున ఏడ్చేవారు పాపం.

—37వ పేజీ చూడండి

# చదువుల్రావు


ఏంబ్రదర్ ఆపరేషన్ 'సక్సెస్' అయినట్టేనా? ఇప్పుడు కులాసాయేనా?
ఏం కులాసారా నాయనా పొరబాటున కడుపులో స్పాంజి పెట్టి కుట్టేసేరుట...
మరిప్పుడెలాగుంది?
ఎన్ని నీళ్ళు తాగినా దాహం తీరక చస్తున్నాననుకో...

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

# వారఫలాలు

దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**19-10-1962 శుక్రవారము మొదలు**
**25-10-1962 గురువారమువరకు**

### మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

ఈ వారంలో మీ యుక్తి, యోచనలతో నిరాటంకంగా ముందుకు పోగలుగుతారు. వృత్తిలో భాగస్తులవంటి వారివల్ల చిక్కు సమస్యలను ఎదుర్కొనవలసివస్తుంది. పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్త వహించవలసి వస్తుంది. వినోద వస్తువుల నిమిత్తం ధనవ్యయం చేస్తారు. క్రొత్త వస్తువులను గురించి ప్రయత్నాలు అనుకూల మార్గంలో నడుస్తూ ఉంటవి. ఈ సమయంలో చేరే స్నేహితులు మిమ్ములను మధ్యలో ఇబ్బంది పెట్టటానికి చూస్తారు. ప్రతిష్ఠ అధికమవుతుంది. ఈ సమయంలో మీరు వినే ప్రతి మాటా అప్పటికప్పుడే లాభించనున్నట్లుగా కనుపిస్తూ ఉంటుంది. బుద్ధిబలంతో వ్యవహారాలనుంచి బయటపడగలుగుతారు. 19, 20 లలో అసౌఖ్యం, మిత్రులతో అభిప్రాయభేదాలు.

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)**

ప్రస్తుతం గతవారంకన్నా గ్రహబలం బాగున్నది. ఆదాయం క్రమక్రమంగా పెరుగుతుంది. ఇతరుల సలహాకు ఎదురు చూడవలసిన అవసరం తగ్గుతుంది. తలవని తలంపుగా వృత్తిలో అభివృద్ధికరమైన మార్పులు వస్తవి. ప్రయాణాలు తాత్కాలికంగా నిలుపుకొంటారు. మొదట ఆందోళనకరమైన వార్తలు తెలుస్తవి. కాని, ఫలితంలో ఏంకాదు. వస్త్రాలు, ఆభరణాలు మొదలయినవి కొంటారు. ఇతరులకు అప్పులు ఈయవలసిన అవసరాలు ఏర్పడగల సమయం. కార్యరంగంలో ఇంతకు ముందున్న వ్యతిరేక లక్షణాలు, శ్రమ తొలగిపోతవి. కుటుంబంలో కూడా మనశ్శాంతి లభిస్తుంది.

> **గ్రహస్థితి**
>
> కర్కాటకంలో కుజ, రాహువులు, కన్యలో బుధుడు, తులలో సూర్యుడు, వృశ్చికంలో శుక్రుడు, మకరంలో శని కేతువులు, కుంభంలో గురువు, మిథున, కటక, సింహ, కన్యలలో చంద్రుడు.

* * *

### మిథునం :

**(మృగశిర 3, 4 పా., ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ఉన్నదున్నట్లు మాట్లాడటంవల్ల విరోధం తెచ్చుకొనవలసివస్తుంది. మీ వృత్తి వ్యాపారాలలో శ్రమపడి ఆదాయము, పేరు ప్రతిష్ఠలు కూడ సంపాదించుకొంటారు. అయితే శత్రువులు మాత్రం అవకాశంకోసం ఎదురుచూస్తూ ఉంటారు. ప్రతిపనిలోను లెక్కచూడకుండా ధనవ్యయం చేస్తూ కార్యం సాధించుకొనతగిన సమయం. కుటుంబంలో ఏ ప్రయత్నం తలపెట్టినా మిమ్ములను సమర్థించి సహాయంచేసేవారు ఉండరు. సాధ్యమైనంతవరకు ప్రసంగాలు పాకంముదరకుండా జాగ్రత్తపడటం అవసరం. దూరదేశంనుంచి ఎదురుచూస్తున్న వార్తలు ఆలస్యంగా అందగలవు. 24, 25లలో ధనలాభం, క్రొత్తవారి స్నేహం.

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష.)**

గతవారంకన్నా అనుకూలమైన సమయం. అధికారము, హోదా బాగుంటవి. ఏ సమయంలో ఆవాంతరం వచ్చిపడుతుందోనని అనుకొనవలసిన పరిస్థితి తొలగిపోతుంది. ప్రయాణాలు అనుకూలిస్తవి. పిల్లలమూలంగా సంతోష సుఖాలు లభిస్తవి. డబ్బు పెట్టుబడిపెట్టి చేయు వృత్తులలో మంచి అవకాశాలు లభిస్తవి. అధికారులవల్ల ముందు ముందు అనుకూలం జరుగగల సూచనలు తెలుస్తవి. బంధుమిత్రుల బాధ్యతలు పైనబడటంవల్ల శ్రమ అధికం అవుతుంది. సంఘంలో ఇతరుల పొరపాట్లు సవరించవలసిన అవసరం వస్తుంది. జాగ్రత్తగా ఉండండి.

* * *

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

శ్రమపడవలసివచ్చినా ఫలితం దక్కుతుంది. మీ మాటనేర్పు, కార్యరంగంలో సమయానుకూలతవల్ల మీరు ఫలితం పొందటమేకాకుండ మిత్రులకు కూడా చక్కగా సహాయపడగలుగుతారు. ఇతరుల మోసపు మాటలవల్ల వృత్తిలో లభించిన అవకాశాన్ని జారవిడుచుకొంటారు. అయితే ఈశ్వరానుగ్రహంవల్ల అదీ మీ మంచికే దారితీస్తుంది. మంచి మనస్సుకల స్నేహితులు లభిస్తారు. సాహసంతో ఏ పనీ చేయరాదు. వ్యాపారంవంటి వృత్తులలో ఫలితం నిదానంగా చేతికివస్తుంది. విద్యార్థులకు ఉత్సాహము, ఆసక్తి పెరుగుతవి. క్రొత్తవారితో పరిచయం లభిస్తుంది. 22, 23 లలో పనులలో పొరపాట్లు, ఖర్చులు.

* * *

### కన్య:

(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ముందు మీ అంతస్తును కాపాడుకొంటారు. మొదట అనుకున్నంత శ్రమ లేకుండా మీ కార్యక్రమాలు సాగిపోతవి. మనశ్శాంతి లభిస్తుంది. ఇంతకుముందు మీ మాటలను కాదన్నవారే మిమ్మలను అనుసరిస్తారు. సాధారణంగా ఏ వ్యవహారంలోను మీ మాటకు అడ్డు ఉండదు. శ్రమకు తగిన ఫలితం ఉంటుంది. పిల్లలమూలంగా సంతోషం లభిస్తుంది. కుటుంబకార్యాలలో అభిప్రాయ భేదాలు కనుపించి మరల వెంటనే సమసిపోతవి. దూరపు ప్రయాణాలు చేయవలసి రావచ్చు. వారాంతంలో అకస్మాత్తుగా దేహబాధలు కలుగుతవి. 20 21లలో శుభవార్తలు, ధర్మకార్యాలు.

* * *

### తుల:

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

బాహ్య పరిస్థితులు ప్రశాంతంగాను, గౌరవప్రదంగాను ఉంటవి. అయితే మీ ఆరోగ్యంలో వచ్చే మార్పులు మీ శక్తిని, ఉత్సాహాన్ని తగ్గిస్తవి. ఆహార విహారాలలో తగినంత శ్రద్ధ చూపలేకపోతారు. చికాకు అధికమవుతుంది. ఎంత ధనం వచ్చినా కొన్ని సమయాలలో శ్రమ తప్పదు. అపవాదులకు అవకాశం లేకుండా జాగ్రత్తపడండి. మాటలలో మిమ్మలను సమర్థించేవారు ఉన్నా, చివరకు సమయంలో స్వశక్తితో కార్యం సాధించుకొనవలసివస్తుంది. మొత్తంమీద మనోబలంతో వృత్తి ఉద్యోగాలలో నిలద్రొక్కుకుని ఫలితం పొందగలుగుతారు. శుభకార్య ప్రయత్నాలు పూర్తి అయ్యేవరకు నమ్మటానికి వీలుకాని సమయం.

* * *

### వృశ్చికం:

(విశాఖ 4–వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)

ఇంతకుముందుకన్నా, మీ పరిస్థితులు మెరుగు అవుతవి, తోటివారి సహాయము, సలహా చక్కగా అనుకూలిస్తవి. మీ నిరుత్సాహం చాలావరకు తొలగిపోతుంది. కార్యభారం పెరిగినా చల్లగా సమర్థించుకొంటారు. శారీరకంగా శ్రమను సహించలేకపోతారు. కాని, మనోధైర్యం బాగుంటుంది. అకస్మాత్తుగా ఖర్చులు పెరుగవచ్చు. తూర్పు, ఉత్తర దిక్కుల నుంచి శుభ లాభవార్తలు తెలుస్తవి. నౌకరులతో పేచీలు రాగల అవకాశాలున్నవి. వ్యవహార రంగంలో ఖర్చులు అధికం. పనులు తెమలక పోవచ్చు. 19, 20 లలో పోటీలు, కలహాలు.

* * *

### ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

ధైర్యం ప్రధానం, దానికి తోడు సహాయం. ఈ రెంటి సహాయంతో మీరు ఈ సమయంలో మీ మాటలను నెరవేర్చుకుని అంతస్తును కాపాడుకొంటారు. ముందు తోచిన సందేహాలు, ఆటంకాలు వాటంతట అవి తొలగిపోతవి. రాజకీయాలలో శ్రమ అధికం. కాని, మాట చలామణీ అవుతుంది. కఠినంగా మాట్లాడితేగాని పనులు చురుకుగా జరుగవు. మీరు మీ స్నేహితులయందు ఆసక్తి చూపించినంతగా మీకు సహాయంచేసేవారుతక్కువ. ధర్మకార్యాలు నెరవేరుతవి. ఇంతకు ముందుకన్నా ఆదాయం బాగుంటుంది. వారాంతంలో దొంగతనంగా వస్తువులు పోయే అవకాశాలున్నవి. జాగ్రత్తగా ఉండండి.

* * *

### మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

తెల్లనివన్నీ పాలేనని నమ్మటంవల్ల శ్రమపడవలసివస్తుంది. కుటుంబ సమస్యలు మీ బాహ్య కార్యక్రమాలకు కొంత ప్రతిబంధకంఅవుతవి. ప్రయాణాలు పూర్తిగా ఫలించకపోయినా నష్టకష్టాలు ఏమీ ఉండవు. ఒకరి మాటను నమ్ముకుని కూర్చోకుండా స్వయంకృషితో ముందుకు పోవటం అవసరం. వృత్తిలో కొత్తవారిని చేర్చుకొనే సందర్భాలలో చిక్కులు రాగల సూచనలున్నవి. ఈ సమయంలో విశేషంగా ఆదాయం వచ్చి, ఖర్చు అవుతుంది. క్రమక్రమంగా కార్యభారం తగ్గించుకొంటూ సుఖంగా ఫలితం పొందగలుగుతారు. 21, 22 లలో లాభవార్తలు, వ్యవహార జయం.

* * *

### కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

వ్యవహార రంగంలో తొందరపడటం మంచిది కాదు. రకరకాల సమస్యలు మిమ్మలను ఆందోళన పెట్టుతవి. ఆదాయంకన్నా అవసరాలు పెరుగుతవి. రాజకీయాలలో పోటీలు పడి శ్రమ పైన వేసుకొనవలసివస్తుంది. వృత్తిలో ఇంతకు ముందు కాలేదని అనుకున్న కార్యక్రమాలను తిరిగి కొనసాగించగల అవకాశాలున్నవి. కుటుంబ విషయంలో రహస్యం అనేది అవసరం. మీ ఆరోగ్యం సంతృప్తికరంగా ఉండదు. మీ వస్తువులను ఇతరుల చేతికిచ్చి మీ అవసరాలకు వినియోగించుకొనలేక చిక్కు పడతారు. వృథా కలహాలు రాగల సూచనలున్నవి. వస్త్రాలు, ఆభరణాలు మొదలయిన విలువగల వస్తువులు కొంటారు. విద్యా, వినోద రంగాలలో చురుకుగా అభివృద్ధి లభిస్తుంది.

* * *

### ఈ వారము ధరలు

బంగారు ధర మందీలో నిలకడగా ఉంటుంది. వెండి ధర కొద్దిగా పెరిగి మరల తగ్గే లక్షణాలున్నవి. నూలు ధర వారం చివరలో కొద్దిగా పెరుగుతుంది. మిర్చి ధర తేజీ వచ్చి నిలుస్తుంది. గోతాలు, జనపనారకు మందీ సూచనలు. వేరుశనగ పప్పు, నూనెల ధరలలో తరచు హెచ్చుతగ్గులు వచ్చి మందీలో నిలువగల అవకాశాలున్నవి.

### మీనం:

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

గతవారంకన్నా ఉత్సాహవంతంగా ఉంటుంది. వృత్తిలో మీ ఆలోచనలు ఫలిస్తవి. మంచి మనుష్యులు కలుస్తారు. క్రమక్రమంగా ఆరోగ్యం కుదురుతుంది. మీ పెట్టుబడులకు తగినంత ఉపయోగం పొందగలుగుతారు. మిత్రులతో కూడిన వార్తలు వస్తవి. కాని, అందును గురించి ఆందోళన చెందవద్దు. ప్రయాణాలు అనుకూలిస్తవి. ధర్మకార్యాలలో పాల్గొంటారు. ఒకప్పుడు స్వల్పవిషయాలలో ఆరంభమైన పోటీలు ఈ సమయంలో కొంచెం తక్కువ కావచ్చు. సంఘంలో గౌరవంతోబాటు ఆదాయం కూడా బాగుంటుంది. ఏ విషయంలోను మీ కృషి వృథా కాదు. 23, 24 లలో మిత్రలాభం, శ్రమతో కార్యసిద్ధి.



"అయ్యా! మీరు కారు మరమ్మతు చేయించుకుని వెళ్లి డబ్బు తెస్తామన్నారు. యింతవరకూ మళ్లీ రాలేదేం?" మెకానిక్ ఫోను చేశాడు.

"ఎలా వస్తాను? నా కారు నీ గారాజీ నందు మొగనే వుండి మరి రానంది. టాక్సీలో యింటి కొచ్చాను...గనుక నువ్వే నా కారును వెనక్కి చాతనైతే తీసుకెళ్లు." అని చెప్పాడు యజమాని.

పార్వతీ శంకర్

**అందాన్ని**
**బయటకు**
**తెస్తుంది...**




లక్మె ఫేస్ పౌడరు మీ చర్మపు సహజ సౌందర్యాన్ని ఇనుమడింప జేస్తుంది. మీ చర్మపు ఛాయతో, అద్భుతంగా, సున్నితంగా కలిసి పోతుంది. మీ వంటి రంగుకు అది తెచ్చే ఫలితాన్ని చూసి మీరు విస్మితులౌతారు. మూడు సైజులలో ... 6 ఛాయలలో ... నేచరల్, రేచెల్, గోల్డెన్ పీచ్, రోజ్ కోరల్, సన్‌టాన్, గ్లోయింగ్ యాంబర్,

# లక్మె
## ఫేస్ పౌడరు

## చిక్కు ప్రశ్నలు?

1. ఎనిమిది ఎనిమిదిసార్లు వేసి [ఎలాగైనా వేసుకోవచ్చును] కూడి వెయ్యి తేగలరా?

2. పన్నెండులో సగం ఎంత? ఆరా? ఏడా? ఏడైతే ఎలా?

3. తొమ్మిదిలోనించి ఒకటి తీసేసి పది చేయగలరా?

4. తొమ్మిది గీతలను పది చేయగలరా?

లెక్కల్రావ్ ఉరఫ్ డి. ఎస్. పి. రావ్.

## సంపద మహిమ

తన ధనమె, తన మిత్రుడు
తన మేడలు తనకు రక్ష సిరి చుట్టంబౌ
తన సంతోషమె తన నాకము
తన సంపదయే స్వర్గమంద్రు తథ్యము
గదరా!

ధనముగల దినములలో
మున్నన తెపుడు గల్గును; మరి ఆ
ధనమే లోపించిన ఆద
రణే కరువగును గదరా!

అప్పు నిచ్చువాడు దాత
అప్పు నివ్వనివాడు లోభి
అప్పు పుట్టించువాడె ముఖ్యుడు
తప్పించుకు తిరుగువాడె ధన్యుడు గదరా.

ఎస్. మధుసూదనరావు (గుడివాడ)

* * *

ఉపాధ్యాయుడు:- అరేయి రాము! కొంగ ఒంటి కాలిమీద నిలబడి జపం ఎందుకు చేస్తుంది రా?

రాము:- అది రెండు కాళ్లు ఎత్తి నిలబడలేదు కనక సార్!

బి. కృష్ణ (ఖమ్మం)

## లంచం గురించి....

టెంకాయ లంచ మౌనా?
వెంకటరమణుండు తక్కువేమి యనంగా
వంకర బుద్ధుల్ గలిగెనా!
కొంకక లంచంబు గుడువ గొప్పగు నొక్కో—

అధికార పదవు లందుకు
పది కాసులు ప్రజల సొమ్ము బత్తెము గొంచున్
కుదురుగ విధి నెరవేర్చుట
బదులుగ లంచాల తెగయ బ్రాకుట తెగులా?

గురుదక్షిణ మార్కులకా?
తరళాక్షికి కొక్క కూడ తగ లంచమ్మా?
చిరుపాప తాయిలంబులు
సరియా లంచంబు లనగ సత్పురుషులకున్.

ధర లంచగొండి పోలునె
తరుణికి, పసికందునకును దైవంబునకున్
పరిహాస మేలనబ్బా!
పరధనముల కాశపడుట పాపము కాదే?

* * *

## ఋణగుణగానం

అప్పు తల్లి, దండ్రి, అప్పుయే దైవంబు
గురువు, రమ్య రక్ష గూర్చు హితుడు
అప్పు కంటె దొడ్డ విత్తంబు మరి లేదు
అప్పు లేనివాడు వింత పశువు.

పెద్దదైన అప్పు ఒక్కటైనను చాలు
ఎన్ని యున్నవేమి చిల్లరప్పులు
ప్రేమనిచ్చు అప్పు నొక్క రూక అయిన పుచ్చుకో
విశ్వదాభిరామ వినుర వేమ.

అప్పు చేయదగు నెవ్వరి వద్దనైన
చేసినంతనె తీర్చివేయక ఎగ్గొట్టదగున్,
గనికల్ల నిజము తెలిసియు అప్పెగ్గొట్టిన
మనుజుడె పో నీతిపరుడు మహిలో సుమతీ.

ఈ క్రింది పద్యం అప్పిచ్చువారలకు అంకితం:—

ఋణదాతకు నాకేమని
పలువురకూ అప్పులిచ్చి కులుకుట మేలా,
ధనవంతుడయిన దాతయు,
వలు బి. పి. దార్ల చేతిలోన దివాళా సుమతీ!

యల్లంశెట్టి పద్మ.

★

విలేఖరి:- సినిమా తారలు పేర్లెందుకు మార్చుకుంటారు?

తార మాజీ భర్త:- మమ్మల్ని మరిచిపోమనడానికి.

ఆర్. రాజా

నేను మిమ్మల్నెక్కడో చూసి నట్లు జ్ఞాపకముండే....!??

అలాగా.... చూసుంటారు! నేను షిబ్బాసు పత్రిలో నర్సుగా వుంటున్నాను!!

jayadev...

చిక్కు ప్రశ్నలకు జవాబులు

1. మొదటివరసలో మూడు ఎనిమిదులు వేయండి. రెండో వరసలో వందలస్థానం వదిలి పదుల, ఒకట్ల స్థానాల్లో రెండు ఎనిమిదులు వేయండి. మిగిలిన మూడు 8 లూ వరసగా ఒకట్ల స్థానంలో వేయండి. ఇప్పుడు కూడితే వెయ్యి వచ్చితీరుతుంది. (మీ లెక్క రైటా? తప్పా?)

2. రోమన్ అంకెల్లోని పన్నెండు—(XII) వ్రాసి అడ్డంగా సగం చేయండి. ఏడు వస్తుంది.

3. రోమన్ అంకెల్లోని తొమ్మిది—(IX) లోంచి ఒకటి తీసేస్తే పదవుతుంది.

4. తొమ్మిది గీతల్లోనే పది అయింది. —TEN

# సీతారామ యుద్ధం

## రామలక్ష్మి



రామచంద్రం సంగీతం వచ్చినవాడు. కేవలం వచ్చినవాడు మాత్రమేకాదు—ప్రజ్ఞావంతుడు కూడాను. అంతెందుకు. అతను కొంచెం కృషిచేశాడో "గ్రామరులోకి ప్రొపర్వాను" పనికివచ్చినంత వాడవుతాడు. అయితే అతనికి ఒకరి జోలి, ఒకరి పొగడ్తలు అనవసరం.

'రేడియోలో పాడవయ్యా!' అంటే "ఊహూ"—'సంగీత కచ్చేరీ ఇస్తావటయ్యా?' అంటే "ఊహూ". ఇలా కొందరు మిత్రులు అతని వైదుష్యమంతా అడవి గాచిన వెన్నెలఅయిపోతున్నదే అని తెగ వగచి, ఆ వెన్నెలను దేశాలమీదకు లాగాలని ప్రయత్నించారు. చివరకు వారి ప్రయత్నం కూడా అడవిగాచిన వెన్నెల, కాకపోతే బూడిదలో పోసిన పన్నీరు అయింది.

చీమ కుట్టినట్లు దులపరించుకున్న రామచంద్ర సంగీత సుధాకర సార్వభౌముడికి మరొక చిక్కు వచ్చిపడింది. ఈమధ్యనే అతనికి పెళ్లయింది. భార్యపేరు హేమలత. ఆ పెంకిపిల్ల తన పేరుకు, రామచంద్రం పేరుకు అమరిక ఏర్పడాలని 'సీత' అని మార్చుకుంది. ఏమైతేనేం ఆమె చెప్పిన మాటలు శ్రద్ధగా వింటాడు రామచంద్రం. భార్యమీద ప్రేమ ఎక్కువ కావటంతో క్రొత్త క్రొత్త రాగాలకు అతని గొంతు సర్దుకుంటున్నది.

సీతకు సినిమా—పాటలంటే ప్రాణాలు విడిచిపెట్టే స్వభావం ఉన్నది. రామచంద్రం సహిష్ణుకత అంతా రభసఅయిపోవటం ఇక్కడే. అలా అని సీత ఒక సినిమాకు వెళ్ళటానికీ, ఒక రేడియో వినటానికీ అడ్డు చెప్పాడాలంటే ఎంతమాత్రమూకాదు. అటువంటి అన్యాయా ద్వేషాలు అతని కెన్నడూ

లేవు—కానీ, ప్రశాంత సమయాల తను ఆరుబయట కూర్చుని త్యాగరాజస్వామి హృదయంగా తన హృదయాన్ని మలుచుకుని "జగమే లే పరమాత్మ ఎవరితో మొరలిడుదు" అనే వేళకు—"వెన్నె చిన్నెల చిలకుందీ—నిన్నొకసారి రమ్మంది" అని పాడుతూ సీత వస్తేనే అతని బాధ. తన ఆర్ద్రభావాలన్నీ ఎవరో దోచుకుపోయినట్లవుతుంది. తనెన్నడూ ఎరుగని ఆగ్రహావేశాలు పిచ్చిగా ముందుకు వస్తాయి. అయినా ఏం చెయ్యగలడు రామచంద్రం. సీత ఎంత ప్రేమిస్తుందో అంత పెంకితనమూ చేస్తుంది. రామచంద్రం ఓర్పుగా చెప్పినకొలదీ ఆవిడ హాస్యానికి అవధుల్లేకుండా పోయింది. ఇది పని గాదని ఆమెకు సంగీతం నేర్పటానికి పూనుకున్నాడు. కొత్తొక వింత కాబట్టి కొన్నాళ్ళ శ్రద్ధగా నేర్చుకుంది సీత. నాలుగైదు కృతుల వరకూ వచ్చినాక క్రమంగా అతను ఒకటి చెప్తుంటే తను మరొకటి అనటం మొదలుపెట్టింది. 'రాగ సుధారస పానము జేసి' అని అతను చెప్పబోతాడు—'రాగమిం దనురాగ మొలికి రక్తి నొసగును గానం' అంటుంది సీత కొంటెగా. రామచంద్రం ఉసూరుమన్నాడు.

అలాంటి రోజుల్లో ఒకరోజు రామచంద్రానికి జీవితంమీద విపరీతమైన విరక్తి కలిగింది.

ప్రతిరోజూ కాలేజీనుండి రాగానే హాయిగా స్నానంచేసి, చల్లని మలయమారుతాన్ని అనుభవిస్తూ చంద్రమై, మధురమై భాసించే నాలుగైదు రాగాలను ఆలపిస్తాడు అతను. ఆరోజు......ఎందుకో అతని మనసు తరంగోన్మత్తమైన జలధిలా వుంది. తన సంగీత సహాధ్యాయుడైన వెంకటేశ్వర్రావు గత రాత్రి అమృతవాహినిగా గానం ఒలికిస్తుంటే ముందున్న త్యాగరాజస్వామి పటంనుండి పూలమాల జారి అతని ప్రోల వాలిందట. ఆ ఆనందోద్వేగంలో అతని మనస్థితి ఎలా ఉండిఉంటుంది? రామచంద్రం ఆలోచిస్తున్నాడు. అనియంత్రితమై, అప్రయత్నంగా రామచంద్రం పెదవులు కదిలాయి.

'రామా యిక నన్ను బ్రోవరాదా.....దయలేదా:..' రామచంద్రానికి ప్రపంచం తెలియటంలేదు. పూర్తిగా వివశుడయ్యాడు. కానీ తొందరలోనే అతన్నెవరో తట్టి లేపినట్లయింది. మరేమీకాదు—లోపల సీత కొంచెం హెచ్చుస్థాయిలో ఏదో పాడుతున్నది. రామచంద్రంకి ఒళ్లు మండిపోయింది. కాళ్లల్లో పడుతున్న పంచెను ఎడంచేత్తో పట్టుకుని కోపోద్రిక్తుడై ఆ గదిలోకి నడిచాడు. ఆ స్థితిలో రామచంద్రాన్ని ఎవరూ గుర్తుపట్టలేరు. ఎప్పుడూ ప్రశాంతంగా, నిర్విశేషంగానే నవ్వుతుండే అతని కళ్లు అశాంతిని, కోపాన్ని ప్రస్ఫుటం చేస్తున్నాయి. సీత మామూలుగా పాడుతున్నది:

"ఒహో......ఒహో.....నినే కోరెగా—కుహూ.. కుహూ అనీ కోయిలా"

"సీతా! నిన్నే పిలుస్తున్నది. నేను పాడుకునే టప్పుడు గోల చెయ్యవద్దని ఎన్నిసార్లు చెప్పాను." రామచంద్రం గొంతులో బాధో, కోపమో తారట్లాడింది.

ఈ హఠాత్సంభూత ప్రభంజనానికి ఉలిక్కిపడి, మరుక్షణం పకపక నవ్వింది సీత.

"నిన్ననే కదండీ ఈ సినిమా చూశాను. మీరు

# సీతారామ యుద్ధం

ప్రక్కన లేకపోతే చూసినట్లేలేదు. రేపు ఇద్దరం వెళ్దాం. అందులో ఈ పాట......అదే......"

"నోర్ముయ్—నువ్వు పాడ నక్కర్లేదు, ఇక్కడ ఉండనవసరం కూడా లేదు......"

"అదికాదండీ......కొంచెం విందురూ. 'కుషీ కుషీగా నవ్వుతూ—చలాకి మాటలు రువ్వుతూ'...."

"సీతా! చెప్తున్నాను—ఇకనైనా నువ్వు నా ఎదుట ఉన్నప్పుడు ఇల్లాంటి పాటలు పాడటం మానుకో......లేదా తక్షణం మీ ఇంటికి వెళ్ళిపో"

"నేను వెళ్ళిపోయాక వంట వండుతూ, త్యాగరాజకృతులు పాడుకుంటారా?......"

"ఎల్లాగో చస్తాను—ముందు ఏదో ఒకటి తేల్చి చెప్పు."

"నన్ను విడచి నీవు పోలేవులే......లేవులే......"

"సీతా......" రామచంద్రం కంఠంతో ఇల్లంతా ప్రతిధ్వనించింది. అతను సంగీత విద్వాంసుడు కావడం వల్ల పొరుగిళ్లవారు పరుగెత్తుకు రాలేదు. కోపం

"బాబూ! యిలాంటి మడ్డి కాఫీ యిస్తున్నారే...దీన్నుంచి మేం తప్పించుకునే వుపాయం చెబుతారా?" అని అడిగాడు బ్రహ్మచారి హోటల్ యజమానిని.

"మీకు గనుక ప్రత్యేకంగా చెబుతున్నాను. ఈ రహస్యం. వెంటనే పెళ్లి చేసుకోండి. మేం కాఫీపౌడర్ అమ్ముతున్నాం. అది కొనుక్కోండి...అంతే" నన్నాడా ఆపద్బాంధవుడు.

పరితాపమూర్తి

ఉవ్వెత్తయి, రామచంద్రం సీత—జుత్తు గట్టిగా పట్టుకున్నాడు. క్షణమో, అరక్షణమో విలంబనం జరిగిపోయిందిగాని, లేకపోతే సీత కపోలాలు రక్తవర్ణం దాల్చిఉండేవి.

ఎందుకో రామచంద్రం—కళ్లు ఎంత క్రోధారుణచ్ఛాయలు అలుముకున్నా సీత భయపడదు. అతను ఒకవేపు జుత్తు పట్టుకు కొట్టటానికి సిద్ధంగా ఉంటే, 'అబ్బ ఎంత కోపం వచ్చింది ఇవాళ మీకు' అన్నది నవ్వి, అతనివైపు చూస్తూ. చప్పున ఆమెను విడచి, తొందరగా గదిలోకి వెళ్ళిపోయాడు.

రామచంద్రం మనసునంతటిని ఒక విధమైన నిర్వేణ్ణత ఆవరించుకుంది. నిర్నిమేషలైన కళ్లతో అతడు కిటికీ దగ్గర నిలబడి బయటకు చూస్తున్నాడు.

సీత వచ్చి అతని ప్రక్కన నిలబడింది.

"ఏమిటి చూస్తున్నారు? ఆ దూరపు కొండలనా, ఈ నీలి ఆకాశాన్నా?"

"ఏమిటని చూడగలం సీతా! ఈ సృష్టిలో చూడగలిగినదల్లా ఈ చెట్లూ, కొండలూ, గుట్టలూ, ఆకాశమూ, మనుషులూ —ఇంతేనా?......కాదుగా ఇంకా ఏదో ఉన్నది సీతా—ఈసృష్టిలో నిక్షిప్తంగా ఉన్న సౌందర్య విలసితమై, సమగ్రస్వరూపం కలిగిన ఆ విశ్వశక్తిని చూడాలని ఉన్నది. ఇటువంటి సంకీర్ణ సౌందర్య ప్రకాశినియైన ప్రకృతి మధ్యనే నిలచి రాధ కృష్ణుడికోసం పరితపించేదట—ఎలా అనుకున్నావు సీతా?—

"నీవులేని జగమ్ము నిజముగా శూన్యమ్ము
వెలుగు వెన్నెల లన్ని అచ్చోట మాయమ్ము
ప్రకృతి కాంతయె యెంతొ పరితపించును సుమ్ము
ఈ రాధికా హృదయ వేదనమ్మునుబోలి."

"అబ్బ! మీకు కవిత్వం కూడా వచ్చేస్తున్నట్లుంది నా ప్రాణానికి......ఎందుకండీ ఈ పిచ్చి ఆలోచనలు—హాయిగా ఉండకుండా, చక్కగా 'మన ఆనందమయమైన సంసారము—ప్రేమసుఖసారము నాకు సింగారము' అనుకుంటూ......" సీత రామచంద్రం వైపు చూసి, నాలిక కొరుక్కుని వంటింట్లోకి పరుగుతీసింది.

అప్పుడే రామచంద్రానికి జీవితంమీద బొత్తిగా విరక్తి కలిగింది. మరి ఏభై సంవత్సరాల క్రితం తను పుట్టవలసింది. అప్పుడు ఇంత అన్యాయంగా ఉండకపోను స్థితి.

"కటకటా నా చరితము కర్ణకఠోరమయ్యా!" అంటూ 'చక్రవాకం'లో విలపించింది రామచంద్రం మనసు.

* * *

ఒకరోజు......

సీత పెదవులపై ఏదో సినిమా—గీతం కొత్త రాగాలు పుంజుకుంటోంది. గిన్నెలు, చెంబులు అనబడే వాద్యాలు శక్తివంచన లేకుండా సీత పాటకు సహాయపడుతున్నాయి.

ఇంతలో అలలు అలలుగా ఒక పాట వినిపించింది. లోపలి గదిలోనుండి—'నడచిపోయింది ఎంతో వాజూకుగా.....నిన్న కనిపించింది—నన్ను మురిపించిందీ.'

సీత ఆశ్చర్యపోయింది. ఆ గొంతు ఎంతదూరం నుండి వినిపించినా, ఎంత మెల్లగా వినిపించినా తను పోల్చుకోగలదు. ఇంతకూ ఆ పాడుతున్నవాడు రామచంద్రమే. గత ఏడాదిగా తను కాపురానికి వచ్చినది మొదలు ఇప్పటివరకూ అతను సినిమా పాట పాడటం ఎప్పుడూ వినలేదు. అందుకే ఆశ్చర్యపోయింది.

పైగా ఎంత చక్కగా పాడుతున్నాడు. సంగీతం తప్ప, సినిమా పాటలు చక్కగా పాడగలడా అనుకునేది. మరి ఇప్పుడు......

గబగబ లోనికివెళ్ళి చిరునవ్వు నవ్వుతూ రామచంద్రం ప్రక్కన కూర్చుంది సీత. పాట పూర్తయ్యే వరకు రామచంద్రం సీతవైపు చూడలేదు.

సీత నవ్వుతూ అన్నది: "ఈ పాటంతా మీకెలా వచ్చిందండీ? సినిమా పాటలు కూడా పాడగలరన్న మాట."

"నేను పాడేదేమిటి, ఆ అమ్మాయి పాడాలి

ఎంత మధురంగా పాడింది......హృదయంలో గుచ్చు కుంది......"

"ఏ అమ్మాయండీ?"

"నీకు తెలియదులే! నిన్న సాయంత్రం నీ బాధ పడలేక అలా పార్కుకు వెళ్లానా! నారాయణతీర్థుల వారి తరంగం ఒకటి పాడుకుంటూ బెంచీమీద కూర్చున్నాను........

ఇంతలో ఒక పాలరాతిబొమ్మలాంటి అమ్మాయి వచ్చి, మహా శ్రద్ధతో నా పాట వింటూ అక్కడే నిలుచుంది. ఎంతసేపటికీ కూర్చోదు......మధ్యలో పాట ఆపి, కూర్చోమని చెప్పి, ఆమె నా ప్రక్కనే కూర్చున్నాక, తిరిగి పాట మొదలుపెట్టాను. తర్వాత ఎంతోసేపు ఆ పిల్ల నన్ను పొగిడింది. సీతా! చెప్పొద్దు! ఆ అమ్మాయిది తియ్యనికంఠం. అది గమనించి, నేను జంకుతూ 'మీకేమైనా పాటలువస్తే పాడండి' అన్నాను. కసిరికొడుతుందనుకున్నాను సుమీ! కానీ, ఎంతో బతిమాలించుకోకుండానే తియ్యగా, చక్కగా తేనెలూరే కంఠంతో ఈ పాట పాడింది.

ఆ పాటంతా నా మనసుకు పట్టిపోయిందనుకో సీతా......సినిమా పాటల్లో ఇంత అందం ఉన్నదని ఈనాటివరకు తెలియదు నాకు......మళ్లీ రేపు కలుస్తానంది. జయదేవుని అష్టపది నేర్పించాలట.... రామచంద్రం చెప్పుకుపోతున్నాడు. సీత ముఖకవళిక చాలామటుకు మారిపోయినయ్.

ఇలా రామచంద్రం ధోరణి రెండు రో[illegible] నుండి ఒక్కలాగే ఉంది.

ఎక్కడిగొడవ అనుకుంటున్నది సీత.

ఆ సాయంత్రం వెన్నెల్లో కూర్చుని కూనిరాగం తీస్తున్నాడు రామచంద్రం. సాధారణంగా అటు వంటివేళల్లో అష్టపదులు పాడుతాడు అతను. కాని ఇప్పుడు సినిమా-గీతం ఒకటి అతి మెల్లగా మహా విరహంతో ఆలపిస్తున్నాడు.

"గోపాలుడు నిను వలచి—నీ పాటను మది తలచి ఏ మూలనో పొంచి పొంచి వినుచున్నాడని ఎంచి—పాడవేల రాధికా'

సీత వచ్చింది. చంద్రబింబంలాంటి ఆవిడ మొహం ఎందుకో విన్నబోయి ఉంది.

"ఏమిటలా ఉన్నావు. ఇవాళ ఆ అమ్మాయి ఎంతో చక్కగా తయారై వచ్చింది. అచ్చం రాధలా ఉన్నది. అన్నట్టు పేరు కూడా రాధే! ప్చ్. నా పేరు కృష్ణుడై ఉంటే ఎంత బాగుండును—రామచంద్రుడట రామ చంద్రుడు. అయినా ఫరవాలేదులే మార్చుకోలేనా ఏమిటి?"

"చాల్లెండి. మీరు సినిమా పాటలు పాడుతోంటే నాకేం బావులేదునుమండీ.....ఆ...కృతి నేను మరచి పోయాను. నేర్పిస్తారా?

"ఏమిటది?"

"ఒక మాట, ఒక బాణము, ఒక పత్నీవ్రతుడే"

"ఎవరు వ్రాశారు? ఓహో త్యాగరాజుగారే కాబోలు, అయినా అంత నీతివంతమైన పాట నేను పాడలేను. ఎంత సేపటికీ ఆ అమ్మాయి పాడిన పాటే చెవుల్లో తిరుగుతున్నది. రేపు మళ్లీ పాడించు కోవాలి రాధచేత. అన్నట్లు నువ్వు కూడా పాడతావు కదు సీతా! ఏదీ ఒక్కసారి......"

ప్రతివారం ఆంధ్ర దేశమంతటా లక్షలమంది ఆంధ్ర సచిత్ర వారపత్రికను చదివి ఆనందిస్తూ ఉంటారు. మీ స్థానిక ఏజెంటు ద్వారా చందాదారులయితే మీ కాపీ మీకు వారం వారం నిశ్చయంగా చేరగలదు.



# సీతారామ యుద్ధం

"అక్కర్లేదు" చివాలున లేచి వెళ్ళిపోయింది సీత. రామచంద్రం ఆనందం అనిర్వచనీయం.

* * *

తెల్లవారింది. మళ్లీ సాయంత్రమయింది. వెన్నెల వచ్చింది. రామచంద్రం ఏదో సినిమా విరహగీతం పాడుతున్నాడు. అయితే అతను సీత మనోభావాన్ని గుర్తించలేని స్థితిలోలేడు.

సెలవు గనక ఇంట్లోనే ఉన్నాడు. ఆవిడ తనకు వినిపించేటట్లు కొన్ని కృతులు పాడింది. తొమ్మిది గంటలవేళ "మనసు నిల్ప శక్తిలేకపోతే"—ఒంటి గంటకు 'అన్యాయము సేయకురా'—నాలుగు గంట లప్పుడు. 'మనసు కరుగదేమి శ్రీమానినీ మనోహర' ఆవిడ కంఠంలో మధురిమను గుర్తించి రామచంద్రం ఆశ్చర్యపోయాడు.

అయినా ఇప్పటివరకూ అతని ధోరణి ఇలా సాగి పోతున్నట్లే క్షణక్షణానికి సీత నిగ్రహించుకోలేక అవస్థపడుతున్నది.

రామచంద్రం స్వచ్ఛమైన కంఠంతో పాడు తున్నాడు.

"సన్నగ వీచే చల్లగాలికి కనులు తెరిచినా నీవాయె, నే కనులు మూసినా నీవాయె......"సీత తట్టుకోలేక పోయింది.

"ఇల్లాంటి పాటలు పాడితే నే నిక్కడ ఉండను" అంది.

"కనులు తెరిచినా నీ........"

"పాట ఆపుతారా? పొమ్మంటారా? మీ రా పాట పాడుతుంటే పరమ ఛండాలంగా ఉంది"

"ఏముంది?"

"నాకు బాగులేదు."

"ఇన్నాళ్లూ సినిమా పాటలంటే గింజాకునేదానివి. నాకు ఇష్టమనగానే నీమోజు తీరిందేమిటి?......"

"ఏమో మీరు పాడితే నాకు నచ్చదు."

"నన్ను పెళ్ళిచేసుకునేముందు సినిమా పాటలు ఎంతమాత్రం పాడకూడదు అని ఆంక్ష విధించ వలసింది. ఇప్పుడు నేను ఒప్పుకునేదిలేదు. ఇష్టం లేకపోతే వెళ్ళిపో."

సీత కదల్లేదు. అనుమానంగా చూశాడు రామ చంద్రం. ఆమె కన్నీరు కాలువలు కడుతున్నది. దగ్గరకు జరిగి అనునయంగా అడిగాడు.

"సీతా నిజం చెప్పు......నేను పాడటం నచ్చలేదా? ఆ అమ్మాయి పాడటం నచ్చలేదా?" సీత పెదవి కొరుకుతూ తలవంచింది. రామచంద్రం నవ్వాడు.

ఇంతకూ అతని నాటకం పర్యవసానంగా సీతలో ఎటువంటి మార్పు వచ్చిందో సరిగ్గా తెలియదుగాని, ఆ తర్వాత రెండు రోజులవరకు తన సంగీతానికీ, సమధి హారానికీ స్వస్తిచెప్పి, ఆమెను ఔదార్యటంలో మునిగి పోయాడు రామచంద్రం.



# బంగారు పంజరం

26 వ పేజీ తరువాయి

**నిర్మల హృదయం హృదయంలో లేదు.** భర్తను చూడటానికే భయం వేస్తుంది. గడ్డం గీచుకుంటే కాలం వ్యర్థం అవుతుందని గడ్డం గీయటం మానేశాడు. రెండంగుళాల పొడవు పెరిగింది గెడ్డం. పెరిగిన వెంట్రుకలు....ఎలా తోస్తే అలా యూనివర్సిటీకి పరుగెత్తే ప్రకాశ్‌ను చూస్తుంటే ఆమె తీరని వ్యథతో విలవిల్లాడి పోయేది. భర్త ఆమెనే కాదు. ఇంట్లో ఎవ్వరిని గూడ పలకరించటం మానేశాడు. యూనివర్సిటీ నించి రాగానే "లతా—లతా తల్లీ .... స్వర్ణా" అంటూ మెట్లెక్కుతూ కేకలేస్తుంటే ఎక్కడున్నా సరే పాప ఘల్లు ఘల్లున గజ్జెలు మ్రోగుతుంటే బొంగరంలా "నాన్నా, నాన్నా" అంటూ ఇల్లంతా తిరుగుతూ, చివరికి తండ్రిని చూడగానే .... ప్రకాశ్ భుజంమీద కెక్కించుకొంటే పాప నాల్గు పళ్లేసుకుని, ముఖం చేటంత చేసుకుని ఆనందంతో ఉక్కిరిబిక్కిరి ఔతుంటే .... ఆ దృశ్యాన్ని చూచిన ఏ మానవ హృదయం ఆనందంతో గంతులు వేయదు ? నెలనించి అతని పిలుపుగాని, ఒక్క మాటగాని ఆ గృహంలో వినిపించటంలేదు.

ఆ ఇంట్లో శోకదేవత తాండవమాడుతోంది. ఎవరికివారంతా మౌనం వహించారు. ఒకరిని చూస్తే ఇంకొకరికి దుఃఖం ఆగటంలేదు. పాప చిలుక పలుకు లెవ్వరినీ గూడా సంతోషపెట్టలేక పోతున్నాయి. పాపను కౌగలించుకుని నిర్మల తోటలో దూరంగా వెళ్లి భోరున ఏడ్చేది. రాత్రిళ్లు తలగడలో తల దూర్చుకుని వెక్కివెక్కి ఏడ్చేది మాలతి. సావిత్రమ్మకు కన్నీ రెప్పుడు కారినట్లే ఉండేది.

అంధకారబంధురమైన మేఘావృతమైన ఆకాశంలో మెరపు మెరసినట్లు నిర్మలకి ఆలోచన తట్టింది. డాక్టరుకు కబురు పంపింది.

డాక్టరు శాంత మూడు నెలలపాటు తన అసిస్టెంట్ డాక్టరుకు హాస్పిటల్ అప్పగించి వెల్లూరుకి వెళ్లి అక్కడ కొన్నివిధాల ట్రీట్‌మెంట్స్ నేర్చుకుని అప్పాటే వచ్చింది. నిర్మల కబురంపిన గంటకు వచ్చింది.

ఇల్లు నిశ్శబ్దంగా—అతి నిశ్శబ్దంగా ఉంది. హాల్లో తివాసీమీద బోలెడన్ని ఆటవస్తువులేసుకుని ఆడలేక సతమత మవుతోంది పాప. డాక్టరు రాక తెలిసి నిర్మల వచ్చింది. ఆమెకేదో పోయిన వస్తువు దొరికినట్లయింది డాక్టర్ని చూడగానే. ఆమె డాక్టరు. ఏదో తగిన సహాయం చేయగలదన్న విశ్వాసం నిర్మలకుంది.

"మీరింకా రాలేదేమో—అని భయపడూ కబురు పంపాను" నిర్మల హమ్మయ్య అని తేలిగ్గా శ్వాస వదలింది.

"ప్రొద్దుటే దిగాను. మరి సావిత్రమ్మ ఏమంటోంది ...." అందామె మామూలు ధోరణిలో. ఆ యింట్లో ఆమె దప్ప మరింకెవరు జబ్బుపడరన్న ధీమాతో.

ఇద్దరూ సోఫాలో కూచున్నారు. నిర్మల అంది. అత్తయ్యా మామూలే .... గానీ పాప వాళ్లనాన్న ధోరణే విపరీతంగా ఉంది" ఆమె హృదయంలోని భారం ఆ మాటల్లోనే వ్యక్తమైంది.

"ప్రకాశ్‌కా ? ఏమైంది ?"

నిర్మల విపులంగా చెప్పింది.

డాక్టర్ శ్రద్ధతో, ఆశ్చర్యంగా విన్నది. ఆమెకిది వింతగా గానీ, చోద్యంగా గానీ లేదు. కానీ ప్రకాశ్—భార్యా బిడ్డలతో సరదాగా, ఎంతో అనురాగంతో మెలిగేవాడు ఇలా మారిపోవటంతో ఆమెకేం చెప్పాలో పాలుపోయింది గాదు.

మోకాళ్లమీద మోచేతులుంచి. వ్రేళ్ల సందుల్లో వ్రేళ్లుంచి ఆలోచిస్తూంది. ఆమెకిదొక షాక్‌లా ఉంది. ఆమె హృదయాలోచనలు పరిపరివిధాల పోతున్నాయి.

"అబ్బాయెన్ని గంటలకు వస్తాడు?" నిర్మల వైపు చూస్తూ అంది.

నిర్మల కళ్లు నీళ్లతో నిండుతున్నాయి. డాక్టర్ శాంత ఆప్యాయంగా వీపుమీద చెయ్యి వేసింది.

"ఎప్పుడొస్తారో .... తెలియదు డాక్టర్ ....

---

రాముడు కుక్కను కొట్టెను

దీనిని కర్మణ్యర్థక వాక్యంగా

చెప్పరా? అన్నాడు టీచర్.

"కుక్క రాముని కరిచెను

అన్నాడు రాము.

మూర్తి కాంతి

---

కారు .... డ్రైవర్ అక్కడే కనిపెట్టుకుని ఉంటారు ..... కొన్నిసార్లు రావటానికే మర్చిపోయి నలాఉంటే డ్రైవర్ ఎలాగో పిల్చుకొస్తాడు"

ఆమె తిరిగి ఆలోచిస్తోంది. గబుక్కున అంది" డాక్టరుకు కన్సల్ట్ చేశారా ?"

"చేశాము. మర్చిపోవటానికీ, మత్తు గల్గించటానికీ మందు లిస్తారు. అవి తీసుకున్న రోజున లెక్కలు చేయరు. కానీ తర్వాత మత్తు వదలిపోగానే వెంటనే గదిలోకి పరుగెత్తుతారు."

మళ్లీ కొన్ని క్షణాలు నిశ్శబ్దం.

"పోనీ నిర్మలా .... రిసెర్చి .... సాగుతోందా ?"

నిర్మల చటుక్కున ఆమె ముఖంలోకి చూచింది. డాక్టరు ముఖంలోని భావాల నర్థం చేసుకోలేకపోయింది. "బాగా సాగుతోంది. ఎంతో మంచి ఫలితాలు వచ్చాయని యూనివర్సిటీవా రెంతో మెచ్చుకుంటున్నారు. క్రొత్త పద్ధతులు, మలభంగా చేసే మార్గాలు, ఫార్ములే అన్నీ సవ్యంగా కనుక్కున్నారు. ఇంకా ఎంతకాలం ఇలా చేస్తుండాలో ......"

ఆమె తిరిగి మౌనం దాల్చింది. కాస్సేపయ్యాక అంది. "కొన్నాళ్లపాటీ వాతావరణం నుంచి దూరంచేస్తే మంచిది. ఎక్కడికైన వెళ్తే మీరు ? కాశ్మీరుకో, రుక్మిణమ్మ దగ్గరకో...'

డాక్టరు మాటలు నిర్మల కెంతో నచ్చాయి. ముఖంలో ఆశాజ్యోతి వెలిగింది. "జాను డాక్టర్. రుక్మిణి పిన్ని దగ్గర కెళ్తాము" అంది.

ఆమె లోపలికెళ్లి అందర్నీ పలుకరించింది. అందర్లోను ఒకటే బాధ. జీవన్మృతుల్లా ఉన్నారంతా. ప్రకాశ్‌ను కొన్నాళ్లపాటు మార్పుకని బొంబాయి పంపమని ఆమె అందరితోను చెప్పింది.

రుక్మిణమ్మకు తంతి ఇచ్చారు. ఫస్టు క్లాస్‌లోని సావిత్రమ్మ, కొడుకు, కోడలు, మనమరాలు బయలుదేరారు. ప్రకాశ్ ఏ ఆటంకం పెట్టలేదు. అతను మౌనంగా అందర్నీ అనుసరించాడు. అందరూ హాయిగా ఊపిరి పీల్చారు. పొగలు క్రక్కుతూ బండి కదిలింది.

వారు వెళ్లిన మూడు, నాల్గు రోజుల వరకు మాలతికీ తండ్రికీ ఏం తోచేదికాదు. సుఖంగా చేరినట్లు తిరుగు తంతి వచ్చింది. రాజారావుగారు మాత్రం దీర్ఘంగా ఆలోచిస్తూ పచార్లు చేస్తున్నారు. ఆయన కెందుకో హృదయభారం రోజు రోజు కెక్కువై పోతున్నట్లుంది.

వారం రోజులు గడిచినై. ఉత్తరాలు చూస్తున్న డాక్టర్ శాంతకు నూతన దస్తూరితో కవర్ వచ్చింది. బొంబాయి ముద్ర చూచి గబగబ చింపింది. చాల చిన్న ఉత్తరమే గాని, ప్రతి అక్షరం హృదయాన్ని చింపి ముక్కలు చేయ గలిగినంత దుఃఖాన్ని ఇముడ్చుకుని ఉంది. ఆమె మనస్సు ఎంతో కృంగిపోయింది. ఉన్న కేసుల్ని అలా అసిస్టెంటుకు ఒప్పగించి రాజారావుగారింటికి బయలుదేరింది.

డాక్టర్ తనకోసం వచ్చిందని తెలుసుకుని రాజారావుగారు బయటికి వచ్చారు. ఆమె ముఖంలో ప్రస్ఫుటంగా అగుపిస్తున్న ఆందోళన, అలసట అతన్నెంతో ఆశ్చర్యపరచినై. ఆమెనలా ఎప్పుడూ చూడలేదు. ఎంతో వృద్ధ స్త్రీలా అగుపించింది.

"ఏమిటి డాక్టర్ ?" అన్నారు కుర్చీలో కూచుంటూ.

"నిర్మల ఉత్తరం వ్రాసింది."

రాజారావుగారు కంపిస్తున్న హస్తం చాచి ఉత్తరం అందుకున్నారు గానీ చదవలేదు. అతని హృదయం అతి త్వరగా లేస్తూ పడూ ఉంది. అతను భారంగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తీస్తుంటే ఆమె చూస్తూ కూచుంది.

"చదవమంటారా ?"

ఆయన తల వూపారు.

"నేను చాల క్లిష్ట పరిస్థితిలో ఉన్నాను. ఆ విషయం మీతో చెప్పమని నిర్మల నన్ను ప్రార్థించింది. ఆవార్త నెలా చెప్పాలో నాకు బోధపడటం లేదు. మీరు ధైర్యంగా ఉండాలి. మనసు దిటవు చేసుకుని వినాలి ....."

రాజారావుగారు లేచి సోఫాలో చేరగిలపడ్డారు. ముఖాన్ని ఉత్తరీయంతో కప్పుకున్నారు. డాక్టర్ శాంత అతనికి దగ్గర్లో ఉన్న స్టూలుమీద కూచుంది. ఆమె కిలాంటి డ్యూటీ మామూలే. తన దగ్గర కొచ్చేవా రందరూ శారీరకంగానో, మానసికంగానో బాధపడేవారే. ప్రేమించినవారు దూరమైతే ఆ వ్యక్తుల నోదార్చే వంతు డాక్టర్దది. ఏదో వేదాంతం చెప్పాలి. ఉపశమనం కల్గించ

## బంగారు పంజరం

వాలి. చేయవలసిన కర్తవ్యం బోధించాలి. భగవంతుని శిక్షకు మప్పనంగా శిరం వంచి అంగీకరించటమే మన పని ..... ఆ ఉద్దేశంతో ఆమె అతని దగ్గర కూచుంది.

"రాజారావుగారు ..... చిన్న పిల్లల్లా అలా అధైర్యపడవచ్చా..... అసలు విషయం తెలుసుకోనే లేదు మీరు .... "

"డాక్టర్ నాకు తెలుసండి .... ప్రకాశ్ .... ప్రకాశ్‌కు పిచ్చి .... కదూ .... డాక్టర్ .... ఔనండీ! .... నా బిడ్డకు పిచ్చి .... హో భగవంతుడా .... ఇదేమి శిక్ష తండ్రీ" అని గొల్లున ఏడుస్తున్నారు.

నరసు పరుగెత్తుకొచ్చింది. ఆ దృశ్యాన్ని చూచి మరుక్షణంలో మాయమైంది. డాక్టర్ శాంత పాలిపోయిన ముఖంతో విస్తుపోయి చూస్తోంది. కొంతసే పయ్యాక అంది "మీ కెలా తెలుసు?"

రాజారావుగారు దుఃఖం మ్రింగుతున్నారు. ఆయాస పడుతున్నారు. అతి ప్రయాసతో ఆమెవైపు చూచి అన్నారు "నాకు ముందునించి తెలుసండి .... నా డెంతో అఖండమైన తెలివి గలవాడు .... లెక్కలు వద్దో అని మొత్తుకున్నా .... వాడు నామాట వినలేదు .... రిసెర్చి వద్దు నాయనా అని తల బాదుకుని చెప్పాను .... ఆ యూనివర్సిటీ నెధవ నా దగ్గరకొచ్చి నన్నొప్పించారు. అంటే నే నంగీకరించక తప్పిందికాదు .... నాకు తెలుసు డాక్టర్! నెల రోజుల ముందు నుంచి తెలుసు ..... ఏం చెయ్యగలను ? ఎవ్వరికి తెలియకుండా డాక్టర్ దగ్గరికి ముందునించీ తీసుకెళ్తున్నాను. బాబు దృష్టి ఎక్కడున్నా లెక్కలమీదే .... ఈ విషయం నా నోటితో ఎవ్వరికి చెప్పలేక నా నోరు కుట్టేసుకున్నాను. ..... నిర్మలమ్మ బాధ .... తల్లి దుఃఖం చూడలేక ఎవ్వరితో అనలేక నాలో నేనే కృంగిపోయాను.... నా తల్లి మాలతి ఈ దుఃఖాన్ని భరించగలదా ? .... " అతను ఆపుతూ ఆపుతూ చెబుతూ మధ్యలో ఏడవటం చూస్తుంటే డాక్టర్ శాంతకు దుఃఖం ఆగిందికాదు.

అంతా నిశ్శబ్దం. క్రచ్చస్ శబ్దం పెద్దగా విన్పిస్తోంది. టకటకమని వేసుకుంటూ మాలతి త్వరగా వస్తోంది. మాలతిని పట్టుకుని ప్రేమగా సోఫాలో కూచోబెట్టుకుంది. నాన్న ఏడుస్తున్నారేం? అన్నట్లు డాక్టర్‌వైపు చూచింది.

"ఏంలేదు. అన్నయ్యకు ఒంట్లో కులాసాగా లేదని హాస్పిటల్‌లో చేర్చారని నిర్మల వ్రాసింది."

"ఏమైంది .... ఎందుకు ?" అంది ఆత్రంగా మాలతి.

"చాల స్తబ్దంగా ఏమీ పట్టించుకోకుండా ఉంటుంటే అబ్జర్వేషన్ కొరకు చేర్పించారట..... కొన్నాళ్లు అలా ఉంచి తర్వాత డిస్చార్జి చేస్తారని వ్రాసింది నిర్మల."

"వదిన వ్రాసిందా ?"

"ఔను. మొదట్నే చెప్పాగా ?" అంటూ ఆమె ఉత్తరం అందించింది.

మాలతి గబగబ కాగితం తీసి సగం చదివి చదవకముందే ఉబికివస్తున్న దుఃఖాన్ని తోసుకుంటూ

బయటికి వచ్చాయి మాటలు. "అయ్యో...డాక్టర్—అన్నాయ్‌ని—చేర్పించింది మెంటల్ హాస్పిటల్ లోనా .... అన్నయ్యా .... నీకు పిచ్చా ...." అంటూ వెక్కివెక్కి ఏడుస్తోంది.....

డాక్టర్ మాలతిని తన కౌగిట్లోకి తీసుకుని తల నిమురుతోంది. "అదిగో .... మాలతీ .... ఏడవకూడదు .... బాగైపోతుందిలే .... అందరిలా దుఃఖపడుతుంటే ఏం లాభం చెప్పు. నిన్ను చూస్తే నాన్నకు దుఃఖం, నాన్న దుఃఖం చూస్తే నీకు దిగులు—ఛా—.... ఛా .... మా అమ్మకదూ ?"

ఎన్నేళ్ళగానో ఆ కుటుంబంతో ఉన్న స్నేహాన్ని, మాలతిపై యున్న ప్రత్యేక ప్రేమాభిమానాల్ని పురస్కరించుకొని ఆమె ఓదారుస్తోంది. వెంకాయమ్మ, నరసు, మాలి గుమ్మం దగ్గర పతికిలబడి కన్నీరు విడుస్తున్నారు.

అందరు వారి పనులను మర్చిపోయారు. అర్ధరాత్రి స్మశానవాటికలోని నిశ్శబ్దం ఆవరించింది. ప్రతి ఒక్కరు ఏవేవో ఆలోచిస్తున్నారు. నిండు కుండలా ఉన్న ఆ కుటుంబంలోని సంతోషం, ఫెళ్ళున కుండ పగిలినట్లు విచ్ఛిన్నమైపోయింది.

కాల ప్రభావాన్నిబట్టి మంచి జరిగినా, చెడు జరిగినా దాన్ని ధైర్యంతో ఎదుర్కొని, అనుభవించటం అలవాటు చేసుకోవా లన్నది డాక్టర్ శాంత. ఒక్కత్తే ఉండటం మంచిది కాదని ఆ రాత్రికి మాలతిని తీసుకుని ఇంటికి వెళ్ళిపోయింది.

ఆ గృహంలో విద్యుద్దీపాలు వెలుగుతున్నా, అమావాస్యనాటి కటికచీకటి పెనుభూతంలా ఆవరించినట్లుంది. ఆ మార్పును గమనిస్తూ మెట్లుదిగి మాలతితో వెళ్ళిపోయిం దామె.

ఆమెకెన్నో విషయాలు తెలుసుకోవాలని ఉంది గాని, అది సమయం కాదని తెలుసు. ఆ సమయం కోసం వేచిఉంది.

నెలరోజులు గడిచినై. ఒకరోజు సావిత్రమ్మ మాత్రం నౌకరుతో ఇంటికి వచ్చింది. స్టేషన్‌కి భర్త వెళ్ళలేదు. సావిత్రమ్మకు తెలుసు భర్త ఎందుకు రాలేదో.

ఆమె బాగా చిక్కిపోయింది. కళ్ళు పీక్కుపోయాయి. ముఖం పాలిపోయి ఉంది. నెమ్మదిగా అడుగులేస్తూ మెట్లెక్కుతుంటే మాలతి దుఃఖాన్ని అణచుకోలేక పోయింది.

సోఫాలో కూచుని తన్ను చూస్తున్న కూతుర్ని చూడగానే ఆమె దుఃఖం వెల్లువలై ప్రవహించింది. "అమ్మా .... మాలతీ .... అన్నయ్య ...." అంటూ కూతుర్ని కావలించుకుని ఏడుస్తోంది. "అమ్మా—అమ్మా" అంటూ వెంకాయమ్మొచ్చి ఆమెను దూరంచేసి కూచోబెట్టింది. రాజారావుగారు గది విడిచి రాలేదు. ఆమే లేచి వెళ్ళింది. భార్యాభర్త లొకరి నొకరు చూచుకున్నారు. ఇద్దరి కళ్లలో నీళ్ళు సుళ్ళు తిరిగాయి. ఒకరి నొకరు గట్టిగా పట్టుకుని "బాబు .... మన ప్రకాశ్" అంటూ దుఃఖిస్తున్నారు. మాలతి వెళ్ళింది వా రిద్దర్ని ఓదార్చటానికి.

స్నానం ఫలహారం అయ్యాక డాక్టర్ శాంతకు కబురెట్టి ఆమెకోసం నిరీక్షిస్తున్నారు. అందరూ మాలతి గది ప్రక్క హాల్లో కూచున్నారు. సావిత్రమ్మ నడిగి అంతా కనుక్కోవాలన్న ఆత్రంతో డాక్టర్ త్వరగా వచ్చింది. రాజారావుగా రక్కడ లేరు. మాలతి ఆ విషయా లడిగి తల్లి మనస్సును నొప్పించలేదు. అందుకే ఆమెకు కబురు పెట్టారు.

"ఏం జరిగింది ? అంతా సరిగ్గా చెప్పండి" అంది డాక్టర్.

సావిత్రమ్మ కన్నీరు తుడుచుకుని ఆరంభించింది. "వెళ్ళిన నాలుగైదు రోజులు బొంబాయి చూడటంతో సరిపోయింది. వాళ్ళిద్దరు ఎలిఫెంటా గుహలు చూడటానికి వెళ్ళారు. అబ్బాయి బాగానే ఉన్నాడు. పాపతో ఆడుకునేవాడు. మా అందరితోను మాట్లాడేవాడు. మీరు చెప్పినట్లు గాలి మార్పు, ఊరి మార్పు మేలు చేసిందని అందర మెంతో సంతోషించాం.

"ఐదోరోజున ఎప్పటిలాగానే లేచాడు. పాపతో నిర్మల క్రింద పడుకుంది. అబ్బాయి మేడ దిగొచ్చాడు. స్నానాని కెళ్తుంటే తుండుకని, గుడ్డలకని నిర్మలపై కెళ్ళింది. గదిలో వాడు పడక మీద పడుకోనే లేదట. వేసిన దుప్పటి వేసినలాగే ఉంది. దీపం ఇంకా వెలుగుతూ ఉందట. బల్లమీద బోలెడన్ని వ్రాసిన కాగితాలు. గబగబ గుడ్డలు తీసుకుని పరుగున వచ్చింది. మాతో చెప్పింది. స్నానాల గదిలో కెళ్తే ముఖం కడుక్కోకుండా టూత్ పేస్టుతో నేలమీద లెక్కలు వేస్తున్నాడు. చిందరవందరగా వేశాడు. నిర్మల ఏడుస్తూ బయటికొచ్చి మమ్మల్నంతా పిల్చుకెళ్ళింది. మా రాకే గమనించలే దబ్బాయి. ఎంతో శ్రద్ధగా దీక్షగా గీస్తున్నాడు, రాస్తున్నాడు. మరిదికి కాస్త లెక్కలు తెలుసేమో వాటివైపు వింతగా చూచాడు.

"ఎలాగో వోలాగు గదిలో ఒక్క కాగితమైన లేకుండాజేసి పడుకోబెట్టాము. నిర్మల ఇక్కడిస్తున్న మాత్రలు మింగించింది.

"ఆ రాత్రల్లా మేలుకుని వాడుచేసిన లెక్కల కాగితాలు పుచ్చుకుని మరిదిగా రెక్కడికో వెళ్ళిపోయారు.

పన్నెండు దాటాక వచ్చారు. జేవురించిన ముఖముతో అలిసిపోయి వచ్చారు. నిర్మలకేం జెప్పారో గాని బిడ్డ నమాంతంగా కావిలించుకుని గుండెలు పగిలిపోయేలా ఏడుస్తోంది. నే నిక తాళలేక అడిగాను .... మరిది చెప్పారు .... ఆ కాగితాలలో వేసిన లెక్కలకు అర్థం పర్థం లేదట. వరసా వాయి, పద్ధతి, క్రమమూ అన్నీ సున్నా .... అంతా పిచ్చి పిచ్చిగా చేసిన లెక్కలవి. వాటిలో ఏ లెక్కలూ లేవు. అన్నీ పిచ్చి లెక్కలేట....—అంత తెలివి గలవాడలా చేయట మేమిటని ఆశ్చర్యపోయానే గాని అసలు సంగతి బోధపడింది గాదు. నాకు వెంటనే చెప్పారు కారు.

"మంచంమీద పసిబిడ్డలా నిద్రపోతుంటే చూస్తూ కూచున్నాను. ఇంతలో నిద్దట్లో పలవరిస్తున్నాడు. విందును గదా ప్లస్సు, మైనస్సు అంటూ ఏమేమో అంటున్నాడు. లేపితే నయమేమో అనుకున్నా గానీ, రుక్మిణి లేపకంది. ఆ సాయంత్రమే పిచ్చి హాస్పిటల్‌కు తీసుకు వెళ్ళాము. ఆ ఆసుపత్రిలో ప్రవేశించేదాక అది పిచ్చాసుపత్రని నాకు తెలియనే తెలియదు. .... నా గుండె నెవ్వరో గట్టిగా నొక్కినట్లయింది.

## బంగారు పంజరం

అంతే ..., తర్వాత తెలివి వచ్చేసరికి ఇంట్లో ఉన్నాను ... అక్కడ బిడ్డనేం చేస్తున్నదీ. ఎంతకాలి కాలం పట్టేదీ కనుక్కునేదాన్ని .... ఒక్కోసారి చూచేందు కెళ్తే నా తండ్రి నన్ను గుర్తించే వాడు కాదు. పాప .... నాన్నా అంటుంటే వెర్రిగా, అర్థరహితంగా చూచేవాడు. నిర్మల బిడ్డను గట్టిగా హృదయాని కదుముకుని పగిలిపోతున్న గుండెల్ని గట్టి చేసుకునేది. భర్త సమక్షంలో ఏడవలేక, అల్లాడిపోయేది. మామీద గమనమే ఉండదు ..... కొన్ని క్షణా లయ్యేవి గబగబ ఇంకులేని పెన్ను తీసుకుని ఏమో వ్రాస్తుంటాడు. నన్ను గన్న తండ్రి .... డాక్టర్ .... ఇది బాగవదా ? నాబిడ్డ నన్ను తిరిగి అమ్మా అని పిలుస్తూ ఎప్పుడు తిరుగుతాడు ? మా ఇంట్లో తిరిగి ఆశాజ్యోతి వెలిగే దెప్పుడు ......" సావిత్రమ్మకు కన్నీళ్లే శరణ మయ్యాయి.

డాక్టర్ ఎంతో ధైర్యం చెబుతూ ఓదార్చింది. గాయం ఒక్కరోజులో మానదు. దినాలు గడిచే కొలది కొద్ది కొద్దిగ మానగలదు. ఓర్పు, సహనం గల్గి ఉండటమే మన విధి. భగవంతునిపై భారం వేసి ఆ శుభ సమయం కోసం నిరీక్షిస్తుండాలి.

ఆరిపోతున్న వత్తి నెగదోసి నూనె పోసింది డాక్టర్ శాంత. ఆ ఇంట్లోని ఆశాజ్యోతి తిరిగి కొద్ది కొద్దిగా వెలగటం ప్రారంభించింది. ఎవరి పనులు వారు యాంత్రికంగా చేసుకుపోతున్నారు. ఆమె రోజూ వారిని విధిగా పలుకరించి వెళ్లేది.

* * *

ప్రసాద్‌గారిల్లు సందడిగా ఉంది. నళిని, వసంతో ఆమె కొడుకు, అల్లుళ్లు వచ్చారు. కుసుమ పండంటి కొడుకును కన్నది. ఆవేళ బారసాల.

సుబ్బారావు కొడుకువైపు గర్వంగా చూచాడు. ముఖానికి పసుపు, తలమీద ముసుగు, చెవుల్లో దూది, తమలపాకుతో ఎర్రబడిన పెదాలు,, ఒడిలో చిన్నారి కొడుకుతో ఉన్న కుసుమను చూస్తుంటే —ప్రథమంగా ఆమె బిడ్డను తన కందిస్తుంటే— అదొక మధురానుభూతి. "నీలానే ఉన్నాడు కుసుం" అన్నాడు బిడ్డను ఎత్తుకుని, చాతకాక తిరిగి అందించేస్తూ.

"భలేవారే మొత్తానికి. అంతా మీలాగే అని అందరూ అంటూంటే" అంది కుసుమ చిన్నగా నవ్వుతూ.

"అంతేలే."

కుసుమ కొడుకువైపు చూస్తోంది. గబుక్కున తలెత్తి భర్తవైపు చూస్తూ అంది "అత్తయ్యా, మామయ్యా ఏమంటున్నారు. తీసుకురాలేకపోయారా?"

"ఎందుకులే ఖర్చు. బాగానే ఉన్నారు. నాన్నయ్యలో మార్పు లేదు .... అన్నట్లు నీ చెప్పినట్లు ఖరీదుగల ఏ సామాను ఇంట్లో లేదు. ఆ వెండి సామాను గూడ ఎప్పుడో .... స్వాహా .... నీకు వ్రాయలేదు గానీ, ఒకరోజు నేను లేనప్పుడు బీరువాలు, పెట్టెలు చూచాడు. ఏమంటాం" అంటూ పగలబడి నవ్వాడు.

కుసుమ, ముఖంలో దిగులు అలుముకుంది.

సుబ్బారావు ఆశ్చర్యంతో చూస్తున్నాడు.

"మరి వస్నెప్పుడు తీసుకెళ్తారు ?"

ఏ ప్రశ్నకైతే సుబ్బారావే కాదు, మరెవ్వరు కూడ జవాబు చెప్పలేరో ఆ ప్రశ్న వేసింది. అతను భార్య ముఖంలోని నిరాశగా చూస్తూ అన్నాడు "ఏమో కుసుం .... ఇంకా మార్గం కోసం చూస్తున్నా. ఇంకొన్ని నెలలైనా పట్టొం దను కుంటా. ఇప్పు డెందుకులే. ఇంకొన్ని నెల లున్నా యిగా. చూదాం" అన్నాడు. అన్నాడే గాని అతనికి తెలుసు ఆ సమయం ఇప్పట్లో రాదని.

కుసుమ అప్పటికి తృప్తి పడింది. అల్ప సంతోషి అనుకున్నా డతను. అన్ని హంగులూ సవ్యంగా జరిగినై. సుబ్బారావు వెళ్లిపోయాడు. వసంతకు సెలవలని రెండురోజు లుండిపోయింది. వసంతకు రెండేళ్ల కొడుకు. గుండులా ఉంటాడు. వచ్చీ రాని ముద్దు మాటలతో ముచ్చటగా మాట్లాడుతాడు. అందరు వాడిని ముద్దుచేసి చెడిపే స్తున్నారని వసంత ఒకటే గోల. మామలు ముగ్గురు మార్చి మార్చి వాణ్ణిషికారుకు తీసుకు వెడుతుం టారు.

నళిని కింకా పిల్లలు లేరు. చెల్లెలు కుసు మనుచూచి తన కలా కొడుకు నెత్తుకునే అవ కాశం ఎప్పుడో ! అని మనస్సులో అనుకునేది. ఆవేళ వెళ్లిపోయే రోజు. పిండివంటలు చేస్తుంటే కూతుళ్లిద్దరు తల్లికి సాయం చేస్తున్నారు. కుసుమ కొడుకు పరిచర్యలో నిమగ్నమైంది.

పదకొండు గంటలు దాటింది. పోస్టు వచ్చింది. నిర్మల దగ్గర నించి ఉత్తరం అందుకున్న ప్రసాద్ గారు కళ్లజోడు తుడుచుకుని కుర్చీలో కూర్చుని సావకాశంగా విప్పారు. నిర్మల లేఖ లెప్పుడు పెద్ద విగా ఉంటాయి. అక్కయ్య వ్రాసిందంటే చివరికి చిన్నతమ్ముడు కూడ అల్లరి మాని బుద్ధిగా కూచుని వింటాడు. ప్రతివారికీ వ్రాస్తుంది. ఒక్కొక్కరికి ప్రత్యేకమైన కబుర్లుంటాయి. ఎంతో ఆశగా వింటారు.

కవరు విప్పేదాక అతను గమనించలేదు. లోపల ఉత్తరం చాల చిన్నదని. ఎప్పటిలాగున అతను అందరికీ విన్పించేందుకని లేచిపోబోయి చటుక్కున తిరిగి కూచుండిపోయారు.

అతని ముఖంలో కత్తి వాటుకు నెత్తురు చుక్క లేదు. తిరిగి చదువుకున్నారు. అల్లుడు గారికి కులాసాగా లేదని, హాస్పిటల్‌లో ఉన్నారని వెంటనే రుక్మిణమ్మగారి అడ్రస్‌కు రావలెనని, ఈ విషయం ముఖ్యంగా కుసుమనించి రహస్యంగా ఉంచమని కోరుతూ వ్రాసిన అతి చిన్న లేఖ. కవరు జేబులో పెట్టుకుని కళ్లు మూసుకుని ఈజీచైర్‌లో పడుకున్నారు. ఎంతసేపైందో— రిజిస్ట్రారు కవరు వచ్చింది. సంతకంచేసి విప్పి చూచాడు. ఐదు వందల రూపాయలకు చెక్కు పంపించింది నిర్మల.

ప్రసాద్‌గారి కళ్లలో గిర్రున నీరు తిరిగాయి. నిర్మల ఆలోచనకు, ఆమె సహృదయానికా తండ్రి హృదయం కరిగిపోయింది. అక్కడ కూచోలేక వెళ్లి పడుకున్నారు. "తండ్రీ నా బిడ్డకేం అన్యాయ కేయకు ...." అని భగవంతుని కోరుతూ మళ్లీ పడుకున్నారు.

నళినితో బయలుదేరారు. అసలు విషయం ఎవ్వరికి చెప్పలేదు. కమలమ్మకు మాత్రం చెప్పారు. ఎవరికి చెప్పినా సరే గాని కుసుమకు మాత్రం చెప్పకు అని వెళ్లిపోయారు. బస్సులో నళినికి చెప్పారు. నళిని భయంతో కంపించిపోయింది. 'అంత అపాయ స్థితిలో ఉండరు. లేకపోతే వైర్ ఇచ్చేదే అక్కయ్య' అని సర్ది చెప్పుకుంది. ఎవ్వరు మాట్లాడలేదు.

హైదరాబాద్‌లో దిగి, బండికింకా వ్యవధి ఉంటే, వియ్యంకుడి ఇంటికి వెళ్లారు. రాజా రావుగా రింట్లో లేరు. మాలతి మాత్రం శోక దేవతలా ఏడుస్తూ వచ్చింది. ప్రసాద్‌గారు సోఫాలో కూచున్నవారల్లా లేచారు. మాలతిని చూస్తుంటే భయంతో గుండెలు దడదడ లాడాయి. నోట మాట రాక అల్లాడిపోయారు ....

"అమ్మా .... మాలతీ .... అన్నయ్య .... బాగు న్నారు కదూ .... ?"

మాలతి చటుక్కున మామగారిని చూస్తూ కళ్లు తుడుచుకుని అంది. "బాగున్నారు ....కానీ"

"మరెందుకమ్మా ఏడుస్తున్నావు ?"

మాలతి మాట్లాడలేకపోయింది. మాటలు

---

ఒక హోటల్ మీద యిలా బోర్డు వుంది... "ట్రాన్సిస్టర్ రేడియోలను, కుక్కలను తేరాదు. భార్యలతో రావొచ్చును."

ఎస్. అనసూయ.

---

పెదాలు దాటలేకపోతున్నాయి. దిగులుగా చూస్తూ అతి ప్రయత్నంతో అంది. "నాన్న .... లేరు .... మీతో చెప్పేందుకు....అన్నయ్యకు పిచ్చి మావయ్యా."

అబ్బ చెప్పేసింది. మొదలు తెగిన మ్రానులా సోఫాలో కూచుండిపోయారు. తల రెండు చేతులతో పట్టుకుని .... "అమ్మా .... నిర్మల తల్లీ .... నీ కెందుకింత శిక్ష విధిస్తున్నాడమ్మా ఆ దేవుడు ? ప్రకాశ్‌కు పిచ్చా .... నిజమేనా .... నీకు సరిగ్గా తెలుసా .... ?" మాలతి ఔనన్నట్లు తలూపి మెల్లగా అంది: "నమ్మటానికే భయంవేస్తుంది మావయ్యా .... అంతా అబద్ధమే ననిపిస్తోంది .... అబద్ధంకాదు .... అంతా నిజం..... వదినె వ్రాసిన ఉత్తరం చూడండి .... ఇప్పుడే వచ్చింది:"

ప్రసాద్‌గారు ఆత్రంగా చదివారు. అది కూడా చాలా చిన్న ఉత్తరం. మాలతికి వ్రాసింది. "మీ అన్నయ్య నిప్పట్లో డిశ్చార్జి చేయరట. ఎంత కాలం పడుతుందో. అత్తమ్మ ఈ వారంలో వస్తా రక్కడికి. మావయ్యగార్కి నమస్కారములు. నీ ఆరోగ్యం జాగ్రత్త. పాప ముద్దులు పంపుతోంది. మాలతీ, నేను జీవిస్తున్నానంటే దాని చూపే అనిపిస్తోంది."

ప్రసాద్‌గారికి ఆ బిడ్డ వ్యథ అంతా ఆ చివరి మాటల్లో ద్యోతకమవుతోంది. తన దుఃఖం చెప్పుకుని ఇతరులను కష్టపెట్టే రకంకాదు నిర్మల. ఆమె హృదయంలోని కారుచిచ్చు నార్పు గల్గే శక్తి ఎవరికుంది ? అనలా హృదయావేద నను భరింపగల్గే శక్తి నిర్మలకుందా ? .... ప్రసాద్ గారు బండికి టైం అయిందని, భోజనం చేయ కుండానే పరుగున స్టేషన్‌కు వెళ్లిపోయారు. వారు వెళ్ళిన దిక్కున చూస్తూ మాలతి భరింప రాని ఆవేదనతో, హృదయాన్ని తేలికపర్చుకునే నిమిత్తం సోఫాలో కూచుని ఒక్కసారి తనివితీర ఏడ్చేసింది. వరను వచ్చి, "అమ్మగారూ — బుల్లెమ్మా ...." అంటూ కూచుంది. అదిమాత్ర మేం జేయగలదు ?"

టాక్సీ దిగి ఇంట్లో అడుగుపెడ్తుండగానే నిర్మల తండ్రిని గట్టిగా పట్టుకుని వలవల ఏడ్చింది. సావిత్రమ్మ, రుక్మిణమ్మ కూడ భోరున ఏడ్చారు. పాపకేం జేయాలో తోచక అందర్కీ అనుస రించింది. ప్రసాద్‌గారి హృదయం వేయి వ్రక్క లైంది.

నిర్మల తండ్రికంతా విశదపర్చింది. ఆ సాయం త్రము విజిటర్స్ డే కావటం మూలాన నిర్మల, ప్రసాద్‌గారు, పాప, రుక్మిణమ్మ, ఆమె భర్త వెళ్లారు. ప్రకాశ్ బాగా చిక్కిపోయాడు గానీ మరీ నీర సంగా లేడు. అంత తెలివిగా, ఎప్పుడూ హుషారుగా మాట్లాడుతూ, నవ్విస్తూ ఎంతో అనురాగం చూపించే తన అల్లుడేనా ఈ ప్రకాశ్ ? అని విస్తుపోయా రాయన. ఏడ్చే శక్తి నశించింది. హృదయా న్నెవరో గట్టిగ అదిమిపట్టినట్లయింది.

ప్రకాశ్ వచ్చి కూచున్నాడు. ఏదో వెలితిగా నవ్వాడు. పాపను ఎత్తుకోబోయి, ఎందుకో చటు క్కున ఎత్తుకోటం మానేశాడు. అందరివైపు వింతగా చూచాడు. "బోలెడు వర్క్ ఉంది. వస్తున్నాగా ..... త్వరగా పూర్తిచెయ్యాలి" అంటూ లేచి వెళ్లిపోతుంటే ఇద్దరు సహాయకులు వచ్చి, "లాభంలేదు. ఇక ఉండరు. మీరు వెళ్లండి" అంటూ ప్రకాశ్‌ను తీసుకు వెళ్లిపోయారు.

భర్త అగుపించినంతవరకు చూస్తోంది నిర్మల. తన భర్త, తన సర్వస్వం—అలా దూరంగా వెళ్లి పోతుంటే, ఒక్కసారి మునుపులాగ ప్రేమగా నిర్మలా—నిమ్మీ—అంటూ చూస్తే—ఒక్కసారి నేను గుర్తుకువస్తే—అని నిరీక్షణతో చూస్తుంటే ఆమె కళ్లలో కన్నీరు పొరలు పొరలుగా వచ్చి భర్తను చూడకుండా అడ్డగించినై. ఆ చూస్తున్న వైపు ఏదో పల్చటి రంగులు అర్థంలేకుండా పులిమినట్లు మాత్రం కన్పించా యామెకు. ఆ అస్ప ష్టమైన రంగుల్నే చూస్తోంది.

వాస్తవిక జగత్తును గుర్తుచేయటానికే కాబోలు ఆ కన్నీటి తెరలు టప్‌న క్రిందపడ్డాయి. ఆమె దృష్టిలో ఏ ఆటంకాలు లేక స్పష్టమైంది. ఎదురుగా పాప అగుపించింది.

ఔను. తన భర్త దూరమైనా, తనకు ప్రసా దించిన ఈ పాపే తన సర్వస్వం .... అనుకుంటూ పాపను గట్టిగా కావిలించుకుంది. ఆమెలో ప్రజ్వ లించుతున్న దుఃఖాన్ని, ఆవేదనను చూడలేక మగ వాళ్లు వెళ్లిపోయారు.

కాసేపు తాళి గట్టిగా నిట్టూర్చి ఆమె కూడ లేచింది.

(సశేషం)

"ఎట్లా ఉందంటూరు బాబాయికి" అనడిగాడు రామారావు డాక్టర్ని.

"గుండెజబ్బుకదామరి...! ఏ విషయమూ చెప్పటం కష్టం. కాని, మనిషి దేహ పటుత్వాన్నిబట్టిచూస్తే, పదేళ్ళవరకు ఆయనకు ఏ చలనమూ లేదు......అదీ సంగతి......మరి నే వస్తా......"

"దేనికి అఘోరించను......పదేళ్ళదాక ఏ చలనం లేదుట. అవునులే ...... నన్ను విసిగించకుండా ఆ జీవుడు ఎందుకు లేస్తాడు ఆ బొందిలోంచి......" అని లోపల్లోపలే పణుక్కున్నాడు రామారావు.

"ఒరేయ్ రామూ......"

"ఏం భీమూ......" అని మెల్లగా తనలో తనే అనుకొని, "ఆఁ...వస్తున్నా బాబాయి..." అంటూ లోపలికి నడిచాడు.

"రా......ఇలా వచ్చి ఈ మంచంమీద కూర్చో. నీతో ఎన్నాళ్ళబట్టో ఒక ముఖ్యమయిన విషయం చెబుదామనుకుంటున్నాను......దానికి సమయం ఇప్పుడు వచ్చింది.....ఆఁ ఏంలేదు.....నే నింక ఎక్కువ రోజులు బ్రతకను. నా చావు ఘంటల్లో ఉంది....' ఏదీ...ఆ ఫ్లాస్కులోని కాసిని కాఫీ ఇలా ఇవ్వు....."

కాఫీ పోసి ఇచ్చాడు రామారావు. త్రాగి మళ్ళీ చెప్పటం మొదలుపెట్టాడు రాఘవయ్యగారు.

"ఇప్పుడు నేను చెప్పబోయ్యేది మన కుటుంబానికి చెందిన ఒక ముఖ్యమైన విషయం. ఇది ఎవ్వరితో చెప్పకూడదు సుమా......! మన వంశంలోని వాళ్ళకు మృత్యువు అందరికి వచ్చేలాంటి సామాన్య మృత్యువుకాదు. మరణ ఘడియలముందు "నల్లపిల్లి" కనపడితేకాని, ప్రాణాలు పోవు. అది ఒక ఆచారమై పోయింది. నేను ఆ నల్లపిల్లికోసమే ఎదురు చూస్తూ ఈ ప్రాణాలని ఇలా పట్టిఉంచాను. ఎందుకో నాకు అనుమానంగా ఉంది. ఆ నల్లపిల్లి ఇవ్వాళో, రేపో కనబడ్తుందని......కనుక నీకు మన వంశం లోనివాళ్ళ మరణ రహస్యం చెబుతున్నాను....."

# తానొకటి తలిస్తే

24-వ పేజీ తరువాయి

రామారావు జాగ్రత్తగా వింటున్నాడు.

మళ్ళీ రాఘవయ్యగారు చెప్పటం మొదలుపెట్టారు.

"మానాన్న చనిపోయేముందుకూడా అలాగే జరిగింది. ఆయన ఇంకొక నిముషంలో చనిపోతారనగా, ఒక నల్లపిల్లి 'మ్యావు', 'మ్యావు' మంటూ, కిటికీ లోంచిదూకి మంచం క్రిందగా పోయింది. వెంటనే మా నాన్న చనిపొయ్యాడు. మొన్న మొన్న మీ నాన్న పోయేముందు కూడా అలాగే జరిగింది....." అంటూ నిట్టూర్చాడు రాఘవయ్యగారు.

"అలా భయపడకు బాబాయి" అంతకుమించి ఏం మాట్లాడాలో తెలియలేదు రామారావుకు.

"ఇదిగో రాముడూ! ఇది మన జీవిత రహస్యం. భద్రం సుమా....." అని ఆయాసంతో ప్రక్కకు తిరిగి పడుకున్నాడు రాఘవయ్యగారు.

రామారావు ఏదో ఆలోచించుకుంటూ బయటకు నడిచాడు.

రాత్రి ఎనిమిదయింది.....

రాఘవయ్యగారు నిద్ర—మాత్రలు మింగి, పాలు త్రాగుదామని లేచి కూర్చున్నారు......

ఎదురుగాఉన్న కిటికీలో ఒక నల్లపిల్లి నుల్చొని "మ్యావు", "మ్యావు" అంటూంది.....!

"ఒ......రే......యి......రా......ము......డూ......" అని ఒక గావుకేక పెట్టాడు రాఘవయ్యగారు.

పక్కగదిలోఉన్న రామారావు "ఏం జరిగింది బాబాయి......" అంటూ గబగబా వచ్చి ఆ దృశ్యం చూసి, అదిరిపోయినాడు.

రాఘవయ్యగారు గది దద్దరిల్లేలా పెద్దగా నవ్వుతున్నారు.

రామారావుకు గుండె ఆగినంత పనయింది......

"ఈ నా చేతిలో ఉన్నదేమిటో తెలుసా......నా యూవదాస్తి నీ పేర వ్రాసిన వీలునామా......" అంటూ పరపరా ఆ వీలునామాను ముక్కలు ముక్కలుగా చించివేశారు.

రామారావుకు ముచ్చెమటలు పోసినయి. ఉక్కిరి బిక్కిరయిపోయినాడు.

"తల్లీ, తండ్రీ పోయిన నిన్ను పెంచి పెద్దవాణ్ణి చేసినందుకు తగ్గ ప్రతిఫలం చూపించావు. పాముకు పాలుపోస్తే, కాటేసి చంపుతుంది......"

రామారావు తలదించుకొని, కాలి బొటనవేలుతో నేలను గీరుతున్నాడు.

"నీ సంగతి నాకు బాగా తెలుసు. నీవు ఈ ఘోర కృత్యానికి ఎందుకు ఒడిగట్టావో కూడా తెలుసు. నీవు ఎదురింటి విమలను ప్రేమించావుకదూ.......? ఆ పిల్ల మన కులం కాకపోవటం వల్లను, మన అంతస్తుకు తగ్గదికాకపోవటం వల్లనూ, మీ పెళ్ళికి నేను అంగీకరించననీ నీకు బాగా తెలుసు. కనుక నా అడ్డం తీరితే నీవు దాన్ని పెళ్ళిచేసుకుని, నా కష్టార్జితమయినఈ ఆస్తితో కులుకుదామనుకున్నావు. నీ కుటిలస్వభావం కనిబెడ్దామనే నేనూ, ఆ డాక్టరూ కలసి ఈ నాటకం ఆడాము. నీవు ఒట్టి వాజమ్మవు...! ఆ నల్లపిల్లి సంగతి చెప్పగానే నమ్మేశావు.......అది శుద్ధ అబద్ధం......! ఏం భయపడకు........ నేను అప్పుడే చావను......!ఈ నా యావదాస్తి నా తదనంతరం తిరుపతి వెంకటేశ్వరస్వామికి రాస్తాను. నీకు ఈ ఇంట్లో ఒక్క చిల్లిగవ్వ కూడా దక్కనివ్వను........నీకు తెలివితేటలు చాలా తక్కువ అని నీకూ తెలుసు......నాకూ తెలుసు........నీవు తెలివిగలవాడివైతే, నా పీడ వదుల్చుకోవటానికి ఏ విషమో పెట్టి చంపిఉండేవాడివి.......నీకంత తెలివెక్కడిది......! ఊఁ......ఇక బయటకు నడు.......నీకూ నాకూ రాం......రాం......" అని గుక్కతిప్పుకోకుండా ఓ ఉపన్యాసం దంచి, పెద్ద పెద్ద అంగలు వేస్తూ, గది బయటకు నడిచాడు రాఘవయ్యగారు....

(ఈమధ్య ఒక ఇంగ్లీషు కధ చదివిన తర్వాత ఈ కథ వ్రాయ బుద్ధేసింది) ★

---

విశి నీళ్ళపోసి, నీరున్న ప్రదేశమును తట్టితే ఒక శబ్దమూ,నీరులేని ప్రదేశమును తట్టితే ఒక శబ్దమూ వస్తుంది. గాలి ఉన్న ప్రదేశమును తట్టితే డండం శబ్దం వస్తుంది. నీరు, ఘన పదార్థములను తట్టితే డబ్ డబ్ శబ్దం వస్తుంది. ఈ సూత్రాల ననుసరించే స్పందన విధానం ఏర్పడింది. ఉదరంలో ప్రేగులలో అంతో ఇంతో గాలి ఉంటుంది. అందువల్ల ఉదరమును స్పందించినప్పుడు 'డం డం' శబ్దము వస్తుంది. 'లివరు, స్ప్లీను పెద్దవైనప్పుడు దుర్మాంస వృద్ధులు ఏర్పడినప్పుడు ఆ ప్రదేశం స్పందించినప్పుడు డబ్ డబ్ శబ్దం వస్తుంది. ఉదరంలో నీరున్నప్పుడు, రోగి ఏ ప్రక్కకు తిరిగి పడుకుంటే ఆ వైపుకు నీరు చేరుతుంది. అంటే ఎడమవైపుకు తిరిగి పడుకుంటే ఎడమ డొక్కలోకి నీరు చేరుతుంది. ఆ ప్రదేశమును స్పందిస్తే డబ్

# మనము-మన దేహస్థితి

21 వ పేజీ తరువాయి

డబ్ శబ్దం వస్తుంది. కుడి డొక్కను స్పందిస్తే డం డం శబ్దం వస్తుంది. రోగిని కుడి ప్రక్కకు పడుకోబెడితే ఎడమ డొక్క డండం శబ్దం చేస్తుంది. ఉదర కుహరంలో నీరున్నదని గ్రహించ డానికి ఇది ఒక మార్గము.

స్పందన విధానము ఒక్క ఉదర పీక్షణలోనే కాదు; వక్ష పరీక్షలోనూ అది సహకరిస్తుంది. సాధారణంగా ఊపిరితిత్తులు గాలితో నిండి ఉంటవి. అందుచేత వాటిని స్పందించినప్పుడు డం డం శబ్దంవస్తుంది. కాని నెమ్మోనియా, క్షయవంటి వ్యాధులలో ఊపిరితిత్తి గడ్డకడుతుంది. అప్పుడు అది డబ్ డబ్ శబ్దం చేస్తుంది. కొన్ని పరిస్థితులలో ఊపిరితిత్తులమీది పొరలలో నీరు, చీము ఏర్పడుతవి. అప్పుడు స్పందనంలో డబ్ డబ్ శబ్దమే వస్తుంది. హృదయం రక్తంతో నిండిఉంటుంది. అందువల్ల హృదయ ప్రదేశం స్పందనంలో డబ్ డబ్ శబ్దం చేస్తుంది. ఆ శబ్దం వినబడే ప్రదేశమునుబట్టి దాని పరిమాణమును తెలుసుకోవచ్చును.

టైఫాయిడ్‌వంటి విషజ్వరములలో ప్రేగులు శక్తిహీనములై ఉబ్బిపోతవి. ఆ స్థితి చాలా ప్రమాదకరమైనది.

స్పర్శన విధానంలాగే స్పందన విధానము చాలా జాగ్రత్తగా మృదువుగా ఉపయోగించాలి. ★

ముసురు పట్టుకుని మరి విడిచిపెట్టక అదేపనిగా పీడిస్తున్నట్లు కనిపించింది. రంగనాయకుని మన స్సువాడు బొత్తిగా పసిగా లేదు. దాని కనేక కారణా లేర్పడ్డాయి. అతని దగ్గిర కుదువ చేసు కొన్న సొమ్మంతా అయిపోవచ్చింది. ఇంక రెండు మూడు నెలలదాకా కూడా బండి నడవడం కష్టమే! రంగనాయకుని కెన్నడు సొమ్ము విలవ తెలియ లేదు. రేపేమయిపోయినా సరే, ఉన్నంతవరకు ఆవేళ హాయిగా కాలక్షేపం చెయ్యడమే అతని కలవాటు. బాగా జాగ్రత్తగా పొదుపుచేస్తేనేగాని రెండు మూడు నెల వరకయినా ఏ లోటు లేకుండా కాలక్షేపం కావడం కష్టమే.

అందుచేతనే ధర్మకర్త ప్రత్యుత్తరం కోసం అతడెంతో ఆత్రంగా నిరీక్షించాడు. కాని ఎన్ని సారులు వెళ్ళినా రేపు రా, మాపు రా, అన్న మాటే గాని ఇంకొక ధోరణి వినబడలేదు. ప్రాణం విసిగినా తిరిగి ఇంకొకసారి వెళ్ళాడు. కాని అవసరంవచ్చి నప్పుడు తానే కబురు పంపిస్తా నన్నాడు. మరి పని కట్టుకుని రానక్కరలే దన్నాడు. ఆ నిర్లక్ష్య ధోరణి తలచుకోగానే వళ్ళుమాలిన అక్కసుతో రంగనాయకుని చెక్కిళ్ళు రెండు కెంపురించాయి. 'ఈ అధికార దుర్మదాంధులంతా ఇంతే! కొంచెం పెత్తనం చేతికి రాగానే కళ్ళు నెత్తిమీదికి వెళ్ళి పోతాయి కాబోలును! ఛీ! ఛీ! ఇటువంటి దుర హంకారుల ముఖాలు చూస్తే పంచమహా పాత కాలు చుట్టుకుంటాయి! ఏది ఏమయినా సరే, ఇక ధర్మకర్త ముఖం చూడకూడదు!' అని చీద రించుకొన్నాడు. కాని అంతలోనే అతని హృదయాం తరాళం 'ఈ ఒక్క కోపంవల్ల ప్రయోజన మేమిటి? ఏదోవిధంగా వెళ్ళి పని సానుకూలం చేసుకుని రావాలి గాని! ఇక ముమ్మందు హేమతో బాటు అన్న వస్త్రాలకు కూడా అలమటించవలసిన దురవస్థ ఏర్పడి తీరుతుంది సుమా! జాగ్రత్త!' అని హెచ్చరించింది. ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టాడు రంగనాయకుడు. 'సరే! ముసురు వల్ల ఈవేళ వీలులేకపోయిందిగదా! రేపో ఎల్లుండో మళ్ళీ ఒకసారి వెళ్ళి చూస్తాను. లేదంటే అనవల సిన మాటలు నాలుగు ఆయన ముఖంమీదే గట్టిగా దులిపివేస్తాను' అని మళ్ళీ కొంచెం సమాధాన పడ్డాడు.

అంతలోనే అతని కింకొక ఆలోచన తట్టింది. రంగనాయకునికి శ్రీరంగంలో గల మల్లు లందరి లోను గట్టి దిట్ట అన్న గొప్ప ప్రఖ్యాతి లభించింది. అందుచేత ఆ నగర వీథులలో తన మల్ల విద్యా నైపుణి వెల్లడించి సౌరుల ప్రశంసలతోబాటు కొంత ధనం సంపాదించుకోవచ్చునని అత నుకొన్నాడు. ఆ పద్ధతి అనుసరిస్తే ఎంతకాల మయినా ఏవిధమయిన చీకు, చింత లేకుండా హాయిగా కాలక్షేపం చెయ్యవచ్చును. శ్రీరంగంలో నప్పాటయినా గడవని మల్లులు ఒకరిద్ద రావిధంగా తమ కుటుంబాలు పోషించుకొంటున్నారు. కాని అతని కది సరిపడలేదు. ఆ పద్ధతివల్ల వచ్చే రాబడి చాలా తక్కువ. అదిగాక నడివీథులలో ఉత్తరీయం పరిచి సాము గరడీ లారంభించడానికి అతనికి ఆభి జాత్యం కూడా అడ్డు వచ్చింది. నిమళాపురంలో ఎంతో మర్యాదగా కాలక్షేపం చేస్తున్న వెంకట

# విశాలనేత్రాలు

23 వ పేజీ తరువాయి

నాయకుని కడుపున పుట్టిన తా నంతటి దైన్యాని కొడబడగలడా? అంతకన్న శ్రీరంగేశుని నామ స్మరణతో యాయవార మయినా మేలే అనిపిం చింది.

ఆ తరవాత సంపన్నులయిన భూస్వాము లెవ్వరి దగ్గిరయినా పాలికాపుగా కుదురుకుని, తన కుటుంబం పోషించుకోవాలని రంగనాయకుని కింకొక సంకల్పం కలిగింది. నిజాని కది చాలా మంచి ఆలోచనే! కాని అతనికి శ్రీరంగంలో సంపన్న భూస్వాముల పేరు లయినా తెలియవు. అక్కడ అడుగుపెట్టినప్పటి నుండి ఏ డెనమండుగురు మల్లులతో తప్ప, ఇక మిగిలిన ఇరుగు పొరుగు లెవ్వరితోను అతని కంతగా దగ్గిర పరిచయం కలగలేదు. ఒక్క హేమ సుందరికే ఇరుగు పొరుగమ్మలతో కొంత సన్ని హిత పరిచయం కలిగింది. చిన్నప్పటినించి రంగ నాయకునికి పలుగురితోను కలిసి కట్టుగా తిరిగే ధోరణి అలవడలేదు! ఇక శ్రీరంగం చేరుకొన్న తరవాత ఇరుగు పొరుగు గృహస్థు లతనితో అంటే అంటనట్టు మాట్లాడి తమ దారిని తాము వెళ్ళిపోయేవారు. అది గమనించి రంగ నాయకు డంతకన్న ముభావం అలవాటు చేసు కొన్నాడు. అందుచేత అతని కీ కష్టసమయంలో ఆదుకోగల ఆత్మీయ మిత్రు లెవ్వరు కనబడలేదు. మల్లులలో కొందరు సంపన్ను లున్నారు గాని, ఏదయినా గట్టి అవసరం వస్తే నా లెవరు అంతగా పట్టించుకోరు. మరి గత్యంతర మేమిటి? క్రమక్రమంగా హేమసుందరికి, తనకు అన్నవస్త్రా లకే మొహంవాచిపోవలసినంత దురవస్థ తప్పనట్టే కనిపించింది.

అది అలాగ ఉండగా ఇప్పుడు పులిమీద పుట్ర లాగ రామానుజ యతీశ్వరుని బెడద ఒకటి వచ్చి పడింది. దీనికి కారణమేమో రంగనాయకుని కెంతగా తల బద్దలు కొట్టుకొన్నా బోధపడ లేదు. బహుశః హేమసుందరి ఊహ నిజమే

అయి ఉండవచ్చునని అనుమానించాడు. అందు దాశరథి వచ్చేవేళ కెలాగయినా ఇంటిదగ్గర ఉండ కుండా ముఖం తప్పించివెయ్యాలని నిశ్చయించు కొన్నాడు. అప్పటికి వాన తుంపర చాలావరకు తగ్గింది. ఉత్తరీయం ఒళ్ళంతా కప్పుకుని వీథి లోకి బయలుదేరాడు. హేమసుందరి వీథిగుమ్మం దాకా అతని వెంటపడి 'ఎక్కడికి?' అన్నట్టు చూసింది.

'అబ్బే ఎక్కడికీ లేదు! ఏమి తోచడంలేదు! అలాగలాగ తిరిగి వస్తాను. ఆయనగాని వస్తే కొంచెం తొందరపనిమీద ఎక్కడికో వెళ్ళారని చెప్పు! బాగా చీకటి పడిన తరవాతగాని తిరిగి రారని చెప్పు.'

'నిజంగా బాగా చీకటి పడిందాకా తిరిగి రారా?'

ఎంతో ఆత్రంగా అడిగింది హేమసుందరి బొమముడి విరిచి.

రంగనాయకుడు లీలగా చిరునవ్వు చిందిం చాడు.

'రానన్నానా? రారని చెప్పమన్నాను గాని!'

'పాపం ఉంటానని మాట ఇచ్చి ఇలాగ మభ్య పెట్టడం భావ్యమేనా! బాగుంటుందా?'

'ఆ! బాగుండకేం జేస్తుంది! అప్పుడే దాశరథి వచ్చేవేళయింది. ఇంతాచేసి వీథి మలుపులో ఎదురు పడతారో ఏమో! మరి నేను వెళ్ళాలి!'

ఒకేఒక అంగలో వీథిలో పడ్డాడు రంగనాయ కుడు. అనేక విధాలయిన ఆందోళనలతో సతమత మయిన అతని పాదా లప్రయత్నంగా కావేరి వీథిలో మద్యశాల వైపు సాగిపోయాయి. గడియ దాటక పూర్వమే అతడా పానశాలలో ప్రవేశిం చాడు. వర్షం కొట్టి కురవడం మూలాన ఆవేళ మల్లు లెవ్వరు అక్కడికి రాలేదు. మద్యశాల అంతా నిర్జీవంగా ఉన్నట్టు కనబడింది. లోపల ఉన్న జనం అంతా కలిసి పలుగు రయిదుగురి కన్న ఎక్కువ మంది లేరు. వారయినా వేరువేరుగా తలొక మూల కూర్చొని మెల్లిది మెల్లిదిగా మధుర మద్యా లాస్వాదిస్తున్నారు. అయినా అతని కెంతో ఉత్సాహం కలిగింది. రవంత మైమరుపు కలిగే



# పండుగ రోజులవలె మీ యింటిని నిత్యమూ కలకలలాడేలా చేసుకోండి!

## Kleertone 'క్లియర్‌టోన్' తయారులను అమర్చుకోండి!




మీ నిత్య జీవితమునకు పండుగ సరదాను తెచ్చుకోండి! క్లియర్ టోన్ యింట్లో వాడుకొనే తయారులతో సౌఖ్యముగా ఉండండి మరియు మీ యింటికి అందము మరియు శుభ్రత కలిగేలా చేసుకోండి. క్లియర్ టోన్ తయారులను ప్రతి నిత్యమూ ఉపయోగించుకొనవచ్చును. వాటితో మీకు కాలములో, శ్రమలో మరియు డబ్బులో పొదుపు చేకూరుతుంది.

క్లియర్ టోన్ వస్తువులు మీ ఆప్తులకు బహుమానముగా యిచ్చుటకు లేక మీరే వాడుకొనుటకు ఎంతో బాగుంటాయి. వాటిని మీరు పండుగ రోజుల్లో లేక ఎప్పుడైనా కొనుక్కోవచ్చును. క్లియర్ టోన్ బహుమానమును నేడే కొనండి!


క్లియర్ టోన్
కుకింగ్ రేంజ్


క్లియర్ టోన్
ట్విన్ హాట్ ప్లేట్


క్లియర్ టోన్
హాట్ ఫుడ్ క్యాబినెట్


క్లియర్ టోన్
వాటర్ బాయిలర్




క్లియర్ టోన్
ఇంపీరియల్ టోస్టర్


క్లియర్ టోన్
ఎలక్ట్రిక్ గడియారము


క్లియర్ టోన్ థెర్మల్ జార్


క్లియర్ టోన్
ఇంపీరియల్ ఇస్త్రీ పెట్టె


క్లియల్ టోన్
ఎలెక్ట్రిక్ కెటిల్

క్లియర్ టోన్
ఫోల్డింగ్ కుర్చీ మరియు టేబిల్




క్లియర్ టోన్
వాటర్ హీటర్


క్లియర్ టోన్
ల్యాంప్స్, ఫ్లోరెసెంట్ ట్యూబ్స్ & ఫిట్టింగ్స్

మీ దగ్గరలోనున్న క్లియర్ టోన్ లేక నేషనల్-ఎక్కో రేడియో డీలరునుండి ఎక్కువ వివరములను తెలుసుకోండి.

**GRA** జెనరల్ రేడియో & అప్లయన్సెస్ లిమిటెడ్
బొంబాయి . కలకత్తా . మద్రాసు . ఢిల్లీ
పాట్నా . బెంగుళూరు . సికిందరాబాదు



JWT-GRA 4227 (A)

# విశాలనేత్రాలు

వరకు తియతియని మైరేయం సేవించాడు. అప్పటి కాతని మనస్సు బాగా తేలిక పడింది. లోలోపలి ఆందోళనలన్నీ పూర్తిగా తుడిచిపెట్టుకు పోయిన ట్లనిపించింది. శరీరం నఖశిఖపర్యంతము దూది పింజలా గాలిలో తేలిపోతున్న ట్లొకవిధమయిన ఆనందానుభూతి కలిగింది. ఆకాశంలో నెమ్మది నెమ్మదిగా తేలిపోతున్న నల్ల నల్లని మబ్బుల బారుల కేసీ, అప్పుడప్పుడు జల్లు జల్లులుగా పడుతున్న వాన తుంపరలకేసి చూస్తూ కూర్చున్నాడు రంగనాయకుడు. అలాగ ఎంతసేపు గడిచిందో అతనికే తెలియదు.

అప్పటికి సూర్యాస్తమయం కావచ్చింది. 'ఈపాటికి నాకోసం నిరీక్షించి నిరీక్షించి తిరిగి వెళ్ళిపోయి ఉంటారు దాశరథి. ఇక నెమ్మదిగా తిరిగి వెళ్ళిపోవచ్చును. అమ్మయ్య! ఈ వేళకీ బెడద తప్పిపోయింది గదా! ఇక రేపటి మాట అప్పు డాలోచించుకోవచ్చును.' అని సంతృప్తి పడ్డాడు రంగనాయకుడు. ద్వారం దగ్గిర ఆవలిస్తూ కూర్చున్న ఆసామీకి పైకం చెల్లించి మళ్ళీ వీథిలో అడుగు పెట్టాడు.

వాన తుంపర బాగా తగ్గింది. మబ్బుల బారు లొకట్లొకటే విడిపోయి దూరదూరంగా తేలి పోయాయి. అస్తమించబోతున్న సూర్యుని కాంతి కావేరి వీథిలో ప్రవహిస్తున్న చిన్న చిన్న వాన కాలవలలో ప్రతిఫలిస్తున్నది. పసిపిల్లలు కొందరు ఆకు దొన్నెలవంటి పడవలు నీటి ప్రవాహాలలో విడిచి పెట్టి వాటి వెంటబడి పోతున్నారు. ఇళ్ళకు మళ్ళి పోతున్న పాడి దూడల అంభారవాలు మాటి మాటికి వీథి మొగలో మారుమోగు తున్నాయి. లేగదూడలు చిన్న చిన్న అరుపులతో ఎగిరెగిరిపడి పలుపులు తెంచుకోవాలని ప్రయత్నిస్తున్నాయి. వాటి మెడలలో మువ్వ లప్పుడప్పుడు మంద్ర మంద్రంగా ప్రతిధ్వనిస్తున్నాయి.

రంగనాయకు డెంతో ఉల్లాసంతో తన భవంతి ఆవరణ ద్వారం తెరుచుకొని లోపల అడుగు పెట్టాడు. అంతే! మరు క్షణంలోనే నిలువునా నిర్ఘాంత పడ్డాడు! వీథి అరుగుమీద తుంగచాప మీద కూర్చున్న దాశరథి చిన్నారి చిరునవ్వుతో 'వచ్చారా! మీకోసమే ఎదురు చూస్తున్నాను.' అన్నాడు. రంగనాయకుని కిక కాళ్ళాడలేదు. అయినా అతి కష్టంమీద తన ఆందోళన నిగ్రహించుకొన్నాడు. ఎంతో వినయంగా దాశరథిని సమీపించి నమస్కరించి దోసిలికట్టి నిలుచున్నాడు.

'తలవని తలంపుగా తొందరపని ఒకటి వచ్చి పడింది. అందుచేత బయలుదేరి వెళ్ళక తప్ప లేదు. అదీగాక ఇంత తొందరగా తిరిగివస్తా ననుకో లేదు. పాపం! నాకోసం చాలా సేపటినించి కని పెట్టుకుని కూర్చున్నారులా ఉంది.'

'దానికేం బాబూ! నాకు వేరే పని ఏమి లేదు! మీకోసమే ఎదురు చూస్తున్నాను. రామానుజుల దర్శనాని కిదే తగిన సమయం. రండి వెడదాము.'

రంగనాయకుని కిక ఏమనడానికి పాలుపోలేదు.

'ఓహో! అలాగా! బాగా పొద్దుపోయింది. ఇక ఈవేళ వారి దర్శనం వీలుపడదేమో అనుకున్నాను. అయితే, సరే, ఇప్పుడే మీవెంట వస్తున్నాను. పదండి.'

ఆ సమయంలో తప్పించుకోవడాని కిక వేరే ఉపాయా లేవీ స్ఫురించక రంగనాయకుడు అలాగే వస్తానని మాట ఇచ్చాడు. కాని లోలోపల గుబ గుబ లాడుతూనే ఉంది. అయినా గుండె రాయి చేసుకున్నాడు. 'ఈవేళ కాకపోతే రేపటికయినా ఆయన దర్శనం తప్పదు! ఇలాగ ఎన్నాళ్ళని తప్పించు కుని తిరగగలను! ఏది ఏమయినా సరే! హేమ సుందరిని విడిచిపెట్టేది లేదని భీష్మించుకుని కూర్చుంటే నన్నేమి చెయ్యగలరు! ఆ! ఇంత కంటె. బాగా పెద్ద పెద్ద బెడదలే తప్పించుకుని బయటపడ్డాను. నా కిది ఒక లెక్కా!' అనుకుని కొండంత ధైర్యం తెచ్చుకొన్నాడు. లోపలికివెళ్ళి 'ఆట్టే సేపు ఆలస్యంకానివ్వనులే! ఇప్పుడే తిరిగివస్తాను.' అని హేమసుందరితో చెప్పి దాశరథి వెంట బయలు దేరాడు. మరి కొంతసేపటికి వా రిద్దరూ రామానుజయతి నివసిస్తున్న శ్రీవైష్ణవ మఠం సమీపించారు.

మిత్రమండలి అనే క్లబ్‌కు నా చేత బలవంతంగా ఒక మిత్రుడు చందా కట్టించాడు. ఆ కాయితం ముక్క తీసుకుని దాని ఖరీదు చెల్లించి అయితే దీనివల్ల నాకు ఏయే అవకాశాలు కలుగతాయటా? అన్నాను. వచ్చే యేడాది మళ్లీ చందా చెల్లించడం మొదటి అవకాశం అన్నాడతగాడు.

కృష్ణేంద్ర

అది శ్రీరంగ దేవాలయం మూడవ ప్రాకారానికి నాలుగవ ప్రాకారానికి మధ్య సువిశాలమయిన మామిడితోపులో నిర్మించిన సమున్నత భవనం. రంగనాయకు డిన్నాళ్ళనించి ఆ మఠంవైపె న్నడు పోలేదు. దానిమీద చిన్న చిన్న దేవాగార గోపురాల వలె నిర్మించిన శిఖరాలపై అమర్చిన పసుపు పచ్చని గరుడాళ్వారు పతాక, శంఖచక్ర గదా ఖడ్గాల కేతనాలు గాలిలో అల్లనల్లన కదలాడు తున్నాయి. సంజె చీకటిలో ఆ శిఖరాలమీద అమర్చిన స్వర్ణ కలశాలు స్పష్టాస్పష్టంగా తరళించాయి.

ఆ మఠంవైపు చూడగానే రంగనాయకుని కేదో ఒక వింత లోకంలో అడుగుపెట్టినట్టని పించింది. దాని ప్రాంగణంలో బారులు బారులుగా నాటిన సురపొన్నలు, బొగడలు, దేవకాంచనాలు, పారిజాతాలు, మందారాలు, పేర్వేరు విచిత్ర వర్ణాల పూలతీగలు అప్పుడప్పుడే వికసించిన పుష్పాల సువా సనలతో రంగనాయకుని కెంతో ఆహ్లాదం కలి గించాయి. 'ఎంత సొగసయిన పూదోట!' అని అత డెంతో ఆశ్చర్యపడ్డాడు. శ్రీరంగనాథుని పాద ముద్రికల వంటి ఊర్ధ్వపుండ్రాలతో, తులసీ మాలలతో రామానుజుని శిష్యులు కొందరు ఎలుగు లెత్తి ద్రావిడ వేదపాశురాలు పఠిస్తున్నారు. మరి కొందరు మఠం వెనక భాగంలో ఉన్నదిగుడు బావిదగ్గిర చేరి సంధ్యావందనా లారంభించారు. ఇంకా కొందరు పెద్ద పెద్ద దీపపు సెమ్మెల చుట్టు చేరి ఏకాగ్ర వీక్షణాలతో, తాళపత్ర గ్రంథాలు భూర్జపత్ర పుస్తకాలు పరిశీలిస్తు న్నారు. నలుగు రయిదుగురు బ్రహ్మచారులు రంగ నాయకునికేసి పరిశీలనగా చూసి తమలో తాము గుసగుస లారంభించారు.

అంతలోనే దాశరథి అతనిని మఠంముందు చావడిలో ఒక చిత్రాసనంమీద కూర్చోబెట్టి 'లోపల ఎవరో దర్శనం చేసుకుంటున్న ట్లున్నారు. కొంచెంసేపు ఇక్కడ కూర్చోండి! నేను మళ్ళీ ఇప్పుడే వచ్చి తీసుకు వెడతాను. ఎంతోసేపు పట్టదు.' అని చెప్పి మఠం లోపలికి వెళ్ళి పోయాడు.

రంగనాయకుని కల్లంత దూరంలో రామా నుజుని ముఖం విస్పష్టంగా గోచరించింది. ఆర్ద్ర ప్రసన్నమయిన మందహాసంతో ఆయన ఎవరితోనో ప్రసంగిస్తున్నాడు. ఒక పండు ముసలి ముత్తయిదువ వినబడీ వినబడని కంఠస్వరంతో తన గోడేదో వెళ్ళబోసుకొంటున్నది. మధ్య మధ్య కంట నీరు పెట్టుకుంటున్నది. ఒక పసివాడు ఆమె మనుమడు కాబోలు, ఒడిలో కూర్చున్నాడు. నిశ్చల దృష్టితో రామానుజునిమెడలోని తులసీమాలలు పరిశీ లిస్తున్నాడు. ఉండి ఉండి ఆయన ఆ వృద్ధాంగన నేదో అడిగి చల్లని పలుకులతో ఓదారుస్తున్నాడు. ఆమె చీర చెంగుతో కనుగొలుకు లద్దుకొంటున్నది. మధ్య మధ్య రామానుజయతి తన విశాల నేత్ర యుగళి పైకెత్తి పరధ్యానంగా దేనివైపో అవలో కిస్తున్నట్టున్నాడు. దీపపు సెమ్మెపై కంచు ప్రమిదలలో చిరుదీపికల కాంతిలో ఆ యతీశ్వరుని ముఖం జాజ్వల్యమానంగా ప్రకాశిస్తున్నది. 'మధ్య మధ్యన కళ్ళు రెండు పైకెత్తి దేనివైపు చూస్తున్నా రాయన!' అని రంగనాయకు డెంతో విస్తుపోయాడు.

అంతలోనే ఆ ముత్తయిదువ ఒడిలో కూర్చున్న పసివా డకస్మాత్తుగా లేచి నిలబడి రామానుజుని కెంతో దగ్గిరగా వెళ్ళి 'తాతా! ఇదిగో! నా బొమ్మ! ఈవేళ పొద్దున్న కొనుక్కున్నాను!' అని తన చిట్టి పిడికిలితో అదిమి పట్టుకొన్న చిన్నారి చందనపు బొమ్మ చూపించాడు! అంతే! ఆ యతీశ్వరు డంతటితో తన ధర్మ ప్రసంగం విరమించి ఎంతో ఆప్యాయంగా ఆ పసివాణ్ణి ఎత్తుకుని ముద్దు పెట్టుకుని ఆ బొమ్మ ఎంతో జాగ్రత్తగా పరిశీ లించి 'చాలా చక్కని బొమ్మే కొనుక్కున్నావే!' అని అభినందించి తిరిగి సుదురు ముద్దుపెట్టు కొన్నాడు. ఆపైన వా రిద్దరి మధ్య అయిదారు నిమిషాల వరకు చిత్ర విచిత్రమయిన సంభాషణ

# విశాల నేత్రాలు

కొనసాగింది. రంగనాయకునికా సంఘటన మరింత ఆశ్చర్యం కలిగించింది. ఎవరో ఇద్దరు చిన్నపిల్లల లాగ అమాయికంగా నవ్వుకుంటూ ఎంత ఆప్యాయంగా మాట్లాడుకొంటున్నారో!' అని మరింతగా ఆశ్చర్యపడ్డాడు రంగనాయకుడు. అంతలోనే ఆ వృద్ధాంగన రామానుజునికి సాష్టాంగ నమస్కారం సమర్పించి ఎంతో భక్తితో ప్రసాదం స్వీకరించి పసివాణ్ణి ఎత్తుకుని తిరిగి బయలుదేరబోయింది. కాని ఆ పిల్లవాడు రామానుజుని విడిచిపెట్టి వెళ్ళిపోవడాని కేమాత్రము ఇష్టపడలేదు. విలవిలలాడి ఆమె పట్టు విడిపించుకోబోయాడు. ఆ ముత్తయిదువ 'మళ్లీ రేపు వద్దాంలే నాయనా!' అని నెమ్మదిగా నెమ్మదిగా బుజ్జగించి ఇవతలికి వచ్చివేసింది.

అంతలోనే దాశరథి రామానుజుడు కూర్చున్న గది కింకొక వైపున్న ద్వారం దాటి రంగనాయకుడు దర్శనం కోసం నిరీక్షిస్తున్న సంగతి నివేదించబోయాడు.. కాని అకస్మాత్తుగా ద్వారబంధం దగ్గరే నిలబడిపోయాడు! అదే సమయంలో ఒక ఉడత చిన్నారి తోక పైకెత్తి చెంగు చెంగున రామానుజుని భుజంమీది కెగిరి ఏదో సంగతి చెప్పబోతున్నట్టు తన చిన్ని పెదవు లల్లల్లాడించింది. మరు క్షణంలోనే ఒకేఒక్క చెంగలింపుతో కుడి చేతిమీది కురికింది. రామానుజయతి దాని నెంతో ఆత్మీయతతో పెదవుల కద్దుకొన్నాడు. పక్కనే జాగ్రత్త చేసిన దానిమ్మగింజలు కొన్ని ముందుంచి 'ఏ సంగతి మరచిపోతానా! ఎంతమాట! అయితే ఈవేళ కొత్తవా రెవరో వచ్చినట్టున్నారు! మరి!' అన్నాడు. ఉడత గింజ లొకటొకటే కొరికి తిరిగి చంగుమని రామానుజుని భుజంమీది కురికింది! ఇంకొక్క రెండు మూడు చెంగిలింపులతో చరచరా ద్వారం దాటి ఆ సమీపంలో ఉన్న గున్నమామిడి చిటారు కొమ్మమీదికి వెళ్లిపోయింది! రామానుజుడు లోలోపల మండి విశాలనేత్రాంతాలలో వెల్లివిరిసిన వాత్సల్యంతో క్షేమంగా చెట్టు కొమ్మమీదికి వెళ్ళేవరకు దానిపై నవలోకిస్తూనే ఉన్నాడు.

## 19

అలాగ నాలుగయిదు నిమేషాల కాలం గడిచింది. దాశరథి సవినయంగా రామానుజుని సమీపించి రంగనాయకుని రాక నివేదించి చిత్రాసనంమీద కూర్చున్న అతనిని లోపలికి తోడుకువెళ్లి సెలవు తీసుకుని తిరిగి వేరొక చోటికి పోయి తన విధి నిర్వహణలో నిమగ్ను డయినాడు. లోపల అడుగు పెట్టగానే రంగనాయకు డత్యంత భయభక్తులతో రామానుజునికి సాష్టాంగ నమస్కృతి సమర్పించాడు. అంతలోనే ఆ యతి తటాలున లేచి నిలబడి అతనిని లేవనెత్తి క్షణకాలం విశ్చల నేత్రాలతో ముఖవైఖరి పరిశీలించి ఎంతో ఆప్యాయంగా తన సరసన కూర్చోబెట్టుకొన్నాడు:

'వచ్చావా! నాయనా! ఇన్నాళ్లనించి నీకోసమే ఎదురుచూస్తున్నాము!'

ఆ పైన అదేవిధంగా విస్ఫారిత విశాలనేత్రాంతో

రంగనాయకుని నేత్ర వైఖరి పరిశీలించడం ప్రారంభించాడు. రామానుజయతి అంతటి అపూర్వాత్మీయతతో తన్నాదరించగలరని అతడు ఆశించుకయినా ఊహించి ఉండలేదు. అదీగాక ఆ పలకరింపు అతని కెంతో విడ్డూరంగా వినిపించింది. ఇన్నాళ్లనించి నాకోసమే ఎదురు చూస్తున్నామని అన్నారేమిటి ? విన్ననే కదా నేను మొట్టమొదట ఈయన కంట బడినది.? మరి ఇన్నాళ్లనించి ఎలాగ ఎదురు చూస్తున్నారు ? నా పుట్టుపూర్వోత్తరా లీయన కింతకు పూర్వమే తెలుసునా ? ఇంతకీ నాకోసం ఎదురు చూడవలసినంత రాచకార్యం ఏమి వచ్చింది? ఇదేమిటి చెప్మా ! ఈ విచిత్రం! క్షణకాలం రంగనాయకుని ఆలోచనల పరంపర ఆవిధంగా కొనసాగింది. సన్నని దీప ప్రమిదల కాంతిలో రామానుజాని ముఖం ప్రఫుల్ల నయనాలతో జాజ్జ్వల్యమానంగా వెలిగిపోతున్నది. ఆ వెడద కనుదోయి వైపు చూడగానే రంగనాయకునికి హేమసుందరి ఆకర్ణాంత నేత్రయుగళి జ్ఞప్తికి వచ్చింది. 'తిరిగి తొందరగా ఇంటికి వెళ్లిపోవాలి ? ఈయన ఎంత సేపటికీ మరి మాటాడరేమిటి ? ఎందు కలాగ అదేపనిగా నావైపు చూస్తున్నారు !' కొంచెం కంగారుపడ్డాడు రంగనాయకుడు ! అంతలోనే రామానుజాని పెదవులపై తరళ దరహాసం వికసించింది. ఆయనే ముమ్మందుగా తిరిగి పలకరించగలరని రంగనాయకు డనుకొన్నాడు. కాని అలాగలాగ అయిదారు లిప్తల కాలం గడిచినా రామానుజాని పెదవులు విడివడలేదు. . రంగనాయకునికా మౌనంతో ఎంతో ఇరుకున పడ్డట్టయింది. మరి భరించలేక అతడే మొట్టమొదట ప్రసంగం ప్రారంభించాడు.

'తమ రొకసారి రమ్మన్నారని దాశరథి అన్నారు. వారే స్వయంగా నన్ను వెంటబెట్టుకొని ఇక్కడికి తీసుకువచ్చారు.'

'అవును నాయనా ! నేనే పిలిపించాను. నీవు శ్రీరంగనాథ స్వామికి సమర్పించిన పైడి కనుదోయి, బంగారు తిలకము పరిశీలించిన పిమ్మట ఒకసారి చూడాలని అనిపించింది. ఆ కనుదోయి స్వామి ముఖంమీద ఇంద్రధనుస్సుల జంటలా జాజ్జ్వల్యమానంగా వెలిగిపోతున్నది! ఇన్నాళ్లనించి ముత్యాల హారాలు, మాణిక్య కుండలాలు, రతనాల బాహుపురులు మొక్కుకొన్న భక్తు లున్నారు గాని ఇటువంటి వింత మొక్కుబడి చెల్లించినవా రెవ్వరు కనబడలేదు. ఇందుచేతనే నిన్నిక్కడికి పిలిపించాను.'

ఆ సమాధానం వినగానే రంగనాయకునికి ముచ్చెమటలు పోశాయి ! తన విడ్డూరపు మొక్కుబడి చెల్లింపువల్ల శ్రీ రంగేశుని యెడల ఏదో గొప్ప అపచారమే జరిగి ఉండవచ్చునని బాగా భయపడ్డాడు:

'స్వామీ ! నావల్ల వల్లమాలిన అపరాధమే జరిగిపోయింది. ఏదో తెలియక చేశాను. మన్నించండి!'

రామానుజయతి రవంత బొమముడిచి ప్రఫుల్ల దరహాసంతో నెమ్మదిగా ప్రశ్నించాడు:

"ఇదేమిటి నాయనా ! ఇలాగంటున్నావు ! ఇందులో స్వామి యెడల అపరాధ మేమయినా జరిగిందా ?'

రంగనాయకుని కిక ఏమనడానికి పాలుపోలేదు. కొంచెంసేపాలోచించి హేమసుందరి తన వేలువిడిచిన మేనమామ కుమార్తె అయినట్టు తల్లిదండ్రు లిష్టపడకపోవడంవల్ల అతి రహస్యంగా ఆమెతో కలిసి శ్రీరంగం వచ్చివేసినట్టు ఒక చిన్న కట్టుకథ కల్పించాడు. తన కోరిక నెరవేరిన పక్షంలో అంతకుమునుపే హేమసుందరి వెడద కనుదోయి కొలతలతో స్వామి కొక సువర్ణ నేత్రయుగళి, పైడి తిలకము సమర్పించవలెనని మొక్కుకొన్నట్టు చాలా సంగ్రహంగా బయటపెట్టాడు. దోసిలికట్టి తెలియక చేసిన తప్పిదం మన్నించవలసినదని తిరిగి ప్రాధేయపడ్డాడు.

కాని రామానుజాని ముఖంలో రవంతయినా ఆశ్చర్యచ్ఛాయ పొడకట్టలేదు. కేవలం తటస్థదృష్టితో అలతి నగవుతో తిరిగి ప్రసంగించాడు:

'దీనిలో అపచారమేమి లేదే ! ఎవరి కోరికల ప్రకారం వారు తమ మొక్కుబడులు చెల్లించుకొంటారు. దానికేమి !'

ఆ ప్రతి సమాధానంతో రంగనాయకునికి ప్రాణం లేచివచ్చిన ట్టయింది. మొట్టమొదట

---

ఒక విమానాశ్రయంలో ఆఫీసర్ కోసరం వెళ్ళాను నేను అక్కడుండే రిసెప్షనిస్టు నడిగాను మా వాడున్నాడా? అని. "లేదు...ఢిల్లీ వెళ్ళాడు కాస్సేపు కూచోండి వచ్చేస్తారంది" ఆమె.

చంద్రకాంతం (కలకత్తా)

---

ఆయన తన దుశ్చర్య గర్హించి గట్టిగా మందలించగలడని ఎంతో భయపడ్డాడు. హేమసుందరితో పాంగల్యాని కంతటితో స్వస్తిచెప్పి తిన్నగా తిరిగి తల్లితండ్రుల దగ్గిరికి వెళ్లిపోవలసినదని ఆజ్ఞాపించగలరని ఆందోళన పడ్డాడు. ఆమాట పాటించనిపక్షంలో తన వ్యవహారం శ్రీరంగ దండనాయకుని వరకు వెళ్లిపోవచ్చునని లోలోపల అనుమానించాడు. కాని అటువంటిదేది జరుగలేదు. పైగా తన మొక్కుబడులతో స్వామి ముఖం దేదీవ్యమానంగా వెలిగిపోతున్నదని ప్రశంసించాడు. ఆ ప్రసన్నధోరణి గమనించి రంగనాయకుడు పట్టరాని సంతోషంతో తలమునక లయినాడు.

అంతలోనే రామానుజయతి అత్యంతాత్మీయ దృష్టితో ప్రశ్నించాడు:

'సరేగాని నాయనా ! అంతటి పెద్ద పైడి కళ్ళ జంట మొక్కుకొన్నావు గదా ! ఆ అమ్మాయి నేత్రాలంత విశాలమ్మైనవా ?'

రామానుజాని వంటి యతీశ్వరుని ముఖతః వెలువడిన ఆ ప్రశ్న విని రంగనాయకు డెంతో ఆశ్చర్యపడ్డాడు. అసలా విధమయిన జిజ్ఞాస కలగడానికి గల కారణమేమో అతని కవగాహన కాలేదు. కొంచెంసేపు వల్లమాలిన బిడియంతో కుంచించుకుపోయి తల వంచుకొని కూర్చున్నాడు. ఎట్టకేల కేదోవిధంగా ధైర్యం తెచ్చుకొని నెమ్మదిగా నసిగాడు:

'స్వామీ తమవంటి పెద్దల దగ్గిర నే నేమని విన్నవించుకోగలను! ఎంతోమంది అందగత్తెలవైపు చూశాను. అంతటి చక్కటి పెద్ద కన్నుల జంట నా కెక్కడ కనబడలేదు. తమవంటి పూజ్యుల దగ్గిర ఉన్నమాట అన్నందుకు మన్నించండి. మొట్టమొదట చూసినపుడు రాత్రింబవళ్లదేపనిగా అవి నన్ను వెంటాడించాయి. అయితే అడుగడుగునా నా కన్ని విఘ్నాలే ఎదురుపడ్డాయి. కనకనే హేమసుందరి నా ఇంట అడుగుపెడితే ఆమె కన్నుల కొలతతో స్వామి కొక మొక్కుబడి చెల్లించుకోవాలని నిశ్చయించుకొన్నాను. మా నిచుళాపురంలోనే కాదు. శ్రీరంగంలో కూడా నా కెక్కడ అటువంటి సొగసయిన కన్నులజంట కనబడలేదు!'

ప్రగాఢ సంకోచంతో మరి రంగనాయకుని నోట మాటే వెలువడలేదు.

రామానుజయతి విపరీతమయిన ఆశ్చర్యంతో తలమునక లయినాడు. ఏనుదోయి వరకు వ్యాపించిన వెడదకన్ను లెంతో పెద్దవిచేసి 'ఓహో ! అలాగా ! అంతటి పెద్ద నేత్రాలజంట ఇంకెక్కడ కనబడనేలేదా ! నిజమేనా ?' అని తిరిగి రెట్టించి అలవోకగా నవ్వి ఎంతో ఆప్యాయంగా అతని చూపుల లోతులు పరిశీలించాడు.

రంగనాయకుడు మిక్కిలి బిడియంతో శిరస్సు కొంచెం వంచుకొన్నాడు:

'నే నన్నమాట నిజమే ! స్వామీ ! ఒక్క మీ నేత్రాలు తప్ప నా కింకెక్కడ అంతటి పెద్ద కనుదోయి కనబడలేదు.'

రామానుజయతి ఆ సమాధానం విని వినగానే ఒక్కమారుగా కలకల నవ్వి నిమేషకాలం రంగనాయకుని ముఖవైఖరి నిశ్చల దృష్టితో పరీక్షించి వాత్సల్యపూర్ణ వీక్షతో ప్రశ్నించాడు:

'సరేలే ! నామాటకేంగాని, ఇంతకుమునుపు నీవు ఎన్నడు కని విని ఎరగనంతటి పెద్దపెద్ద కన్ను లున్నాయనుమీ! కావాలనుకుంటే అవి నీ కొకసారి చూపించగలను. ఏమంటావు !'

ఆ ప్రశ్నలో ఆర్ద్రాదరంతోబాటు కొంచెం కొంటెతనంతో మేళవించిన చిలిపితనం స్పష్టస్పష్టంగా స్ఫురించింది. అది విని రంగనాయకుడు నిలువునా నిర్ఘాంత పడ్డాడు. 'ఇదేమిటీ యతీశ్వరు లిలాగ మాట్లాడుతున్నారు! ఇటువంటి పెద్ద లిలాగ ప్రసంగించవచ్చునా ?'' అనుకొన్నాడు. నిజానికా ప్రశ్నలో గల అంతరార్థం అతనికేమి అంతు పట్టలేదు. అంతటి సొగసయిన కన్ను లున్న ఆ అతిలోక సౌందర్యమూర్తి ఎవ్వరో అతనికసలే బోధపడలేదు. ఆ అందాలరాశి ఎవ్వరో అన్న జిజ్ఞాస లోలోపల మొలకెత్తింది. ఆ మనోజ్ఞమూర్తిని గూర్చి ప్రశ్నించాలన్న గట్టి సంకల్పం కూడా కలిగింది. మాట నోటిదాకా వచ్చింది. అంతలోనే రంగనాయకు డెంతో సంకోచించి 'పెద్దల సాన్నిధ్యంలో అటువంటి మోటు ప్రస్తావన బొత్తిగా మర్యాద కాదు!' అని తమాయించుకొన్నాడు. ఉట్టిపడుతున్న అడకువతో

విషయమై తన లోపలి దృఢనిశ్చయం వెల్లడించాడు.

'స్వామీ ! శ్రీరంగేశుని దయవల్ల హేమసుందరి నా ఇంట అడుగు పెట్టినప్పుడు అదే పదివేలను కొన్నాను. ఈ జన్మ కిక కోరుకోవలసిన దేదీ లేదని అనిపించింది. ఎంతటి అతిలోకసుందరి అయినా సరే, మరినే నింకొకరి వైపే కన్నెత్తి చూడ దలుచుకోలేదు. ఆ శ్రీరంగశాయి దయవల్ల పది కాలాలపా టామె చల్లగా ఉంటే, మరి నా కంతకన్న కావలసినదేదీ లేదు ! అయితే ఒక్క మనవి!—'

'ఏమిటది ?' అన్నట్టు రామానుజుని నుదుటి మీద ఒక చిన్న బొమముడి విరిగింది. పెదవులపై చిరునవ్వలవోకగా తరళించింది. రంగనాయకుడు దేవాలయంలో ఊరేగింపు ఉత్సవాలలో స్వామి సేవకోసం తాను చేసిన ప్రయత్నం సంగతి ప్రస్తావించాడు. చిన్ననాటి నించి సాము గరిడీలలో తన నిరంతర సాధన సంగతి వెల్లడించి ఊరేగింపులలో రంగనాథుని సమక్షంలో మల్లవిద్యా నైపుణితో వీర ప్రముఖుల మన్నన లందుకోగలనని విన్నవించాడు. అంతకుమును పెన్నిమారులు సందర్శించినా దేవాలయ ధర్మకర్త నోట 'రేపు రా ! మాపు రా !' అన్న మాటలే తప్ప వేరొక చల్లని పలుకే వినబడలేదని చెప్పి ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టాడు. ఆయనతో చెప్పి దేవాలయంలో తన కేదయినా చిన్న ఉపాధి ఏర్పాటు చేయించ వలసినదని వేడుకొన్నాడు. వీలుపడితే ఒకసారి తన మల్లబంధ పాండిత్యం పరీక్షించవలసినదని ప్రార్థించాడు.

రామానుజు డదివిని రవంత ఆశ్చర్యపడి ఉపతాయు, తోరహత్తము మొదలయిన క్లిష్ట మల్ల బంధాల సంప్రదాయాలలో సామాన్యుల కెవరికి తెలియని కొన్ని మెళకువ లడిగి రంగనాయకుని సమాధానాలు విని సంతోషించి ఎంతో ఆప్యాయంగా అభినందించాడు. మరికొంతసేపటివరకు వారి ప్రసంగంమల్లవిద్యమీదే కొనసాగింది. రామానుజుని కాయా విషయాలలో గల నిశిత పాండిత్యము, అభినివేశము గమనించి తిరిగి రంగనాయకు డింకొక మారు విపరీతాశ్చర్యంతో తలమునక లయినాడు! ఏకాగ్రదృష్టితో రామానుజుని బలిష్ట భుజ యుగళి పరిశీలించిడం ప్రారంభించాడు. ఆ యతీశ్వరు డతని ఆ ప్రగాఢాశ్చర్య ధోరణి గమనించి తిరిగి ప్రశ్నించాడు:

'ఏమిటి నాయనా ! అంత ఏకాగ్ర వైఖరితో పరిశీలిస్తున్నావు !'

రంగనాయకుడు కొంచెం తటపటాయిస్తూ పలికాడు:

'ఏమిలేదు స్వామీ ! చిన్నతనంలో మీరు సాము గరిడీలలో బాగా చెయ్యి తిరిగినవారయి ఉండవలెనని అనుకుంటున్నాను......'

దానికి ప్రతి సమాధానంగా రామానుజుని ముఖతః రంగనాయకుని కొక క్షణకాలం వరకు సన్నని కలకల నవ్వు మాత్రమే వినిపించింది:

'అబ్బే ! నాదంతా కేవలం శ్రుత పాండిత్యమే ! బాగా పిన్నతనంలో మెళకువ లేవో కొన్ని విన్నాను. అంతే !'

# విశాల నేత్రాలు

తిరిగి రామానుజుని ముఖతః రవంత హాస ధ్వని వినిపించింది. రంగనాయకునికా ప్రత్యుత్తరంతో మరింత ఉత్సాహం కలిగింది.

'మీరీ విద్యలో ఆరితేరిన గట్టి దిట్టలయి ఉండవచ్చునని మొట్టమొదట నడివీధిలో కనిపించినప్పుడే అనుకొన్నాను. లేకపోతే సామాన్యు లెవరికి తెలియని లోతు లెలాగ తెలుస్తాయి. ఎప్పుడయినా ఇంకొకసారి వచ్చి మీవద్ద మెళకువలు కొన్ని నేర్చుకోవాలని ఉవ్విళ్లూరుతున్నాను. వీలుపడితే నాకు తెలిసిన మెలిక పట్లు కొన్ని మీ ఎదట చూపించాలని కోరిక ! గట్టిగా పరీక్షించిన పిమ్మట మీవంటి విద్వాంసులు మెచ్చినదే విద్య !'

అంతలోనే రామానుజుని పెదవులపై రవంత ఆశ్చర్యంతో మేళవించిన దరహాసం తరళించింది:

"అబ్బే ! నా కిందులో తెలిసినది చాలా తక్కువ ! అంతా వినికిడి ! గట్టిగా తలుచుకున్నావంటే ఈ విద్యలోనే కాదు ! మరే విద్యలో నయినా నన్నిట్టే మించిపోగలవు ! ..... సరే దీనికేమిగాని ఆ ధర్మకర్త నింకొకసారి చూసిరా ! అక్కర మన దయి

---

'డాక్టర్: అదేమయ్యా! ఇప్పుడేగా రోగిని డిస్‌ఛార్జి చేశాను! మళ్లీ ఇలా మూర్ఛ వచ్చిందేం.

రోగిని తెచ్చినవారు: అయ్యా మీ బిల్లు మహిమ.

రాజారాం (అరట్ల)

---

నప్పుడు మాటిమాటికి వెళ్లి దర్శనం చేసుకోవాలి ! తప్పదు ! స్వామి కృపవల్ల నీ కోరిక నెరవేరగలదేమో ! ఎవరు చెప్పగలరు ? ఏ వ్యవహారంలో నయినా నావంటివా రంతా కేవలం నిమిత్తమాత్రులే ! అయినా నీ వడిగిన మాట మరిచిపోనులే ! "

ఆవిధంగా గట్టిగా ధైర్యం చెప్పిన తరువాత తన కోరిక తప్పక నెరవేరగలదని రంగనాయకు డెంతో సంతోషించాడు. సవినయంగా సాష్టాంగ నమస్కారం సమర్పించాడు. సెలవు తీసుకుని తిరిగి వెళ్లిపోవాలని అనుకొన్నాడు. కాని రామానుజు డతని అంతటితో విడిచిపెట్టలేదు. ప్రసాదం తీసుకొని రావలసినదని ద్వారాని కవతల అనతి దూరంలో ఆజ్ఞకోసం నిరీక్షిస్తున్న దాశరథి కాజ్ఞాపించాడు. అత డంతవరకు కొనసాగిన వారి ప్రసంగాల ధోరణి విని నిశ్చల శిలాప్రతిమలా నిర్ఘాంతపడ్డాడు. ఆచార్యునికి సాముగరిడీలలో అంతటి నిశిత పాండితి ఉన్న దన్న సంగతి అత డింతకుమునుపెన్నడు విని ఉండలేదు. అదీగాక ఆయన ఎంతటి ఆత్మీయులతో ప్రసంగించినా ఎన్నడు తన నిరంతర గంభీరముద్ర రవంతయినా సడలించలేదు. అటువంటి మౌనమూర్తి ఈనా డొక కొత్త మల్లవితో చిరకాల మిత్రునితో సంభాషించిన ట్లెంతో ఉల్లాసంగా ప్రసంగిస్తున్నారు ! ఇదేమిటీ విచిత్రం! అని తిరిగి ఎంతో ఆశ్చర్యపడ్డాడు. ఎన్నెన్ని విధాల ఆలోచించినా అంతటి అపూర్వాత్మీయ దృష్టికేమి హేతువో అతని కేమాత్రము బోధపడలేదు. సరే, మున్ముం దదే తెలియగలదని సమాధానపడి వెనువెంటనే వేర్వేరు తీయని భక్ష్యాలతో నిండించిన పళ్ళెరంతో ఆచార్యుడున్న గదిలో ప్రవేశించాడు. రంగనాయకుడు ఒకటి, రెండు తినుబండారాలు మాత్రమే ఆరగించి మరి అక్కర లేదని చెప్పి తప్పించుకోవాలని అనుకొన్నాడు. కాని రామానుజుని అనునయంవల్ల చాలావర కవి స్వీకరించక తప్పలేదు. ఆ అపూర్వాదరణ దాశరథికే ఎంతో ఆశ్చర్యం కలిగించింది. రంగనాయకునికా ఆర్ద్ర వాత్సల్యం గమనించగానే కన్నతల్లి ఆప్యాయత జ్ఞప్తికి వచ్చింది. అయితే హేమతో కలిసి శ్రీరంగంలో అడుగుపెట్టిన తరువాత ఆమె తన విషయమే ఉపేక్షించిన సంగతి తలుచుకొని ఉసూరుమని నిశ్వసించాడు. ఆ యతీశ్వరుని ఆర్ద్ర వాత్సల్యం తలుచుకోగానే అతని నేత్రాంతాలలో చిన్న చిన్న కన్నీటి బిందువు లొకటి రెండు పొటమరించాయి. నెమ్మదిగా ఫలహారం ముగించి అతి కష్టంమీద నిగ్రహించుకొన్న డగ్గుత్తికతో తిరిగి సెలవు తీసుకొన్నాడు. రామానుజయతి ఎంతో ఆత్మీయతతో అతని భుజంమీద చెయ్యివేసి ద్వారం వరకు సాగనంపి 'చూడు ! నాయనా ! తీరికగా ఉన్నప్పు డెప్పుడయినా ఇక్కడికి వస్తూ ఉండు !' అన్నాడు.

రంగనాయకు డదివిని వల్లమాలిన సంకోచంతో తల వంచుకొన్నాడు. తొణికిసలాడుతున్న గద్గదికతో విన్నవించాడు. 'స్వామీ ! నావంటి మోటు మనిషికిక్కడ అడుగు పెట్టడానికి కూడా అర్హత లేదు. అయినా తమ అజ్ఞ అతిక్రమించడం భావ్యంకాదని వచ్చాను. మరి ఇంతకంటె తమవంటి వారికి నేనేమని విన్నవించుకోగలను !'

ఆపైన ఎంతగా ప్రయత్నించినా అతని నోట మాట వెలువడలేదు. ప్రగాఢ గద్గదికతో కంఠం స్తంభించింది. అంతలోనే మంద్ర మధురస్వరంతో రామానుజుని ప్రతి సమాధానం వీనుదోయిలో ప్రతిధ్వనించింది !

'ఎందుకు నాయనా ! నీ కింతటి సంకోచం ! స్వయంగా నేనేగదా రమ్మన్నాను. అదీగాక నా దగ్గిరకు మెళకువలు కొన్ని నేర్చుకోవాలని అన్నావు ! అప్పుడే మరిచిపోయావా ! నేనుకూడా నీ విద్య లోతెంతటిదో పరిశీలించాలని కుతూహల పడుతున్నాను. నీ పిడికిలిపట్టు ఎంత గట్టిదో ఒకసారి పరీక్షించాలని అనుకుంటున్నాను. అయితే అంత తొందర లేదులే! ఎప్పుడయినా ఒకసారి తీరిక చేసుకునిరా !'

ఆ ప్రత్యుత్తరంలో రంగనాయకుని లోలోపలి సంకోచం చాలావరకు తొలిగిపోయింది. శిరస్సు కొంచెం పైకెత్తి తిరిగి ప్రగాఢ భక్తితో రామానుజుని పాదాలమీద వాలి నమస్కరించి సెలవు తీసుకొన్నాడు.

—ఇంకా ఉంది.



విఠల్ ప్రొడక్షన్స్‌వారి "మదనకామరాజుకథ"లో హర్‌నాథ్, అనూరాధ.

# హరనాథ్

11-వ పేజీ తరువాయి

వీరన్న ఆ అబ్బాయిని తీసుకెళ్లి దర్శకునికీ, నిర్మాతలకూ పరిచయం చేశాడు. ఆ 'వేళావిశేషం' అటువంటిది అన్నట్టు—ఏ రకమైన టెస్టూ అవసరం లేకుండానే—దర్శకుడు రామినీడు ఆ పాత్రకు హరనాథ్‌ను నియమించారు!

హరనాన్ అసలు ఊరు విజయనగరం. ఐతే 2—9—36 వ తేదీన హరనాథ్ రాపర్తిలో—వాళ్ల తాతగారి ఇంట పుట్టాడు. నాలుగో తరగతి దాకా అక్కడే చదువుకున్నాడు. హరనాథ్ తండ్రిగారైన వరహాలరాజుగారు భారీమనిషి—నటుడు! ఆయన అప్పుడు సినిమా పరిశ్రమలోనే పని చేస్తూ ఉండేవారు. స్వర్గీయ రామబ్రహ్మంగారు నిర్మిస్తున్న 'మాయలోకం' చిత్రానికి ఆయన సహాయ దర్శకుడు! అంచేతనే హరనాథ్, రాపర్తి నుంచి మద్రాసుకు మకాం మార్చాడు. మైలాపూరు కేసరి హైస్కూల్లో ఐదవ తరగతిలో ప్రవేశించాడు. స్కూలుఫైనలు వరకూ అక్కడే చదివాడు. ఈ 'సినిమా ఛాన్సు' ఎప్పట్నుంచో అతని కోసం కనిపెట్టుకు కూచున్నది. హైస్కూల్లో చదువుకుంటున్న రోజుల్లోనే అతనికి ఆ ఛాన్సులు తగిలాయి. ఐతే, చదువు పాడవుతుందని—వాళ్ల నాన్నగారు ఒప్పుకోలేదు. ఆ 'ఛాన్సు' వరేనని వెళ్లిపోయి, బి. ఏ. అయేదాకా నిరీక్షించింది! ఐదో తరగతి చదువుతున్నప్పుడు హరనాథ్ 'స్టేజి' ఎక్కాడు. అంటే—నటుడిగా. అంతకుపూర్వం అతను వక్తృత్వ పోటీలలోనూ, ఇతర పోటీలలోనూ విరివిగా పాల్గొంటూనే వచ్చాడు. చిత్రమేమిటంటే—ఆ నాటిక అతను రాసిందే! 'గుడ్ లక్' అని ఒక చిన్న నాటిక రాసి—మరో ఇద్దరు ముగ్గురు కుర్రాళ్లను పోగేసుకుని, రిహార్సలుచేసి—హైస్కూల్లో ఆడారు. హరనాన్ 'ఉత్తమ నటుడు' బహుమతికూడా పుచ్చుకున్నాడు. "ప్రథమంలోనే ప్రథమ బహుమతి పుచ్చుకొన్నావు—నటుడిగా ప్రకాశిస్తావులే" అని ఉపాధ్యాయులు ఆశీర్వదించారు.

ఇంటర్‌మీడియేట్‌లో ఆర్ట్సు కాలేజీలో చేరిన తర్వాత—అతనికి ఉత్సాహమూ ఉషారూ మరింత హెచ్చాయి. హైస్కూలు జీవితం నుంచి, కాలేజీ జీవితానికి అడుగుపెట్టగానే—అతనికి కొత్త మనుష్యులూ కొత్త లోకమూ కనిపించింది. చదువుతో పాటు ఇతర కార్యకలాపాల్లో పాల్గొనటం కూడా అవసరమేనని అతను భావించాడు. కాలేజి 'తెలుగు సమితి' కి అతన్ని కార్యదర్శిగా ఎన్నుకున్నారు.

హరనాథ్‌కు మొదట్నుంచీ స్వతంత్రంగా బ్రతకాలనీ, స్వతంత్రంగా ఉండాలనీ కోరిక. అతని తండ్రిగారు కూడా దానికి దోహదం ఇచ్చారు. అందుకనే అతను—తలిదండ్రులు మద్రాసులోనే ఉంటున్నా—కొన్నాళ్లు హాస్టల్లో ఉండేవాడు. ఇంట్లో ఉంటే—చదువు సరిగా సాగకపోవచ్చుననీ, పైగా—చదువు వాతావరణంలోనే ఉంటాడని—అతని తండ్రిగారు హాస్టల్లో ప్రవేశపెట్టారు. హరనాథ్ ఆ సంవత్సరం చెన్నపురి ఆంధ్ర విద్యార్థి విజ్ఞాన సమితికి కూడా కార్యదర్శిగా పనిచేశాడు.

ఇంటర్ పూర్తయిన తర్వాత, అతను కాకినాడ కాలేజీలో బి. ఏ. లో చేరాడు. అక్కడ కూడా అతను వివిధ కార్యకలాపాలలోనూ ముందంజ వేస్తూ వచ్చాడు. 'యూనియన్ సెక్రటరీ' హరనాథే! అప్పుడు అతను నాటకాల్లో కూడా బాగా పాల్గొన్నాడు. అంతర్ కళాశాల నాటక పోటీలలో హరనాన్ 'ఉత్తమ నటుడు'గా వచ్చాడు. ఆ పోటీలు ఆంధ్రా యూనివర్శిటీలో జరిగాయి. హరనాథ్ బృందంవారు—'ఇన్స్‌పెక్టర్ జనరల్' నాటకం ఆడారు. ఈవిధంగా ఆడుతూ పాడుతూ కష్టం ఎరగకుండా—అతని విద్యార్థి జీవితం గడిచిపోయింది. బి. ఏ. పరీక్ష ఇచ్చిన తర్వాత అతను మద్రాసు రావటమూ, ఏంచెయ్యాలో తోచక మధనపడటమూ, సినిమా ఛాన్సు లభించటమూ జరిగాయి.

'మా యింటి మహాలక్ష్మి' చిత్రంలో 'బుక్' ఐన తర్వాత, ఆ వార్త చెబుదామని అతను వాళ్ల ఊరెళ్ళాడు. అతను నవ్వుతూ ఆ 'శుభవార్త' చెప్పగా—ఇంట్లోవాళ్ళంతా కేకలు వేశారు. కష్టసాధ్యమైన పనిని తాను ఎట్లా సాధించగలిగాడో చెబితే—వాళ్ళంతా సంతోషిస్తారని అతను భావిం

చాడు. కాని, కథ అడ్డంతిరిగింది. మారు మాటాడకుండా—హరనాథ్ చేతిసంచి నిండా బట్టలు కుక్కుకుని—రాత్రికి రాత్రి బయల్దేరి—మద్రాసుకు ప్రయాణంకట్టాడు! ఆ 'మొండితనం' అతన్ని బాగా కష్టపడేట్టూ, బాధపడేట్టూ చేసింది. 'మా యింటి మహాలక్ష్మి' చిత్రంలో నటిస్తున్న రోజుల్లో—ఆర్థికంగా అతను చాలా బాధలు పడ్డాడు. ఎంచేతంటే 'కొత్తగా 'ఛాన్సు' ఇచ్చిన వాళ్లను డబ్బు కావాలని అడిగితే ఏమనుకుంటారోననే భయం'; అడక్కపోతేనే నయం అని అతను ఊరుకున్నాడు. ఈ సమయంలో అతను డక్కామొక్కీలూ, బఠాణీలూ, వేరుశనగకాయలూ బాగా తిన్నాడు!

ఒకనాడు 'రంగూన్ రౌడీ' నాటక ప్రదర్శనంలో హరనాథ్, ముక్కామల కృష్ణమూర్తికి కనిపించి—మామూలుగా మాటా మాటా ఆడాడు. ఆ మాటలలో ముక్కామలకు ఏదో తృప్తీ, ఆనందం కనిపించాయి. అపుడు ఆయన 'ఋష్యశృంగ' కు దర్శకత్వం వహిస్తున్నాడు. ఋష్యశృంగుని పాత్రకు ఇంకా ఎవర్నీ అనుకోలేదు—ఎవరా ఎవరా అని మాత్రం అనుకుంటున్నారు. ఆ మర్నాడే హరనాథ్ కు మంచి ఛాన్సు వచ్చింది—అదే 'ఋష్యశృంగ' పాత్ర!

మొదటిపట్టు, సినిమాలలోనే స్థిరపడదాం అనే నిర్ధారణ కలిసి, హరనాథ్—పెద్దవాళ్ళను దారికి తెచ్చాయి. వాళ్ళబ్బాయి సినిమాలలో రాణిస్తున్నాడని, రాణిస్తాడని వాళ్ళు విన్నారు. 'సరే, ఏదో ఒకటి స్థిరంగా ఉంటే చాలు' నని వాళ్ళు తృప్తి పడ్డారు.

ఈ చిత్రాల తర్వాత హరనాథ్, 'శబరి', 'మనోరమ', 'అపూర్వ చింతామణి' చిత్రాలలో బుక్ అయినాడు. రామారావుగారు 'సీతారామ కల్యాణం' నిర్మిస్తూ—రాముడి పాత్రకు చాలా అన్వేషణలు చేసి చేసి, ఆ పాత్రకు హరనాథ్ ను నిర్ణయించారు! ఆ చిత్రంలో కనిపించినంత అందంగా— నిండుగా, ఇతర చిత్రాలలో కనిపించలేదన్నంత 'అందం' గా కనిపించాడు. శ్రీరాముడిగా కనిపించాలని—రామారావుగారు హరనాథ్ కు మంచి మేకప్ వేయించారు—మంచి దుస్తులూ, ఆభరణాలూ తొడిగించారు. ఈ చిత్రంతోనే హరనాథ్ కు పేరూ, ప్రఖ్యాతి వచ్చాయి. భీష్మ చిత్రంలోని కృష్ణ పాత్రధారణకు కూడా—ఈ రామపాత్రే కారణమైంది. 'ఋణానుబంధం', 'కలిసి ఉంటే కలదు సుఖం', 'చివరకు మిగిలేది' (గెస్టు) 'పెళ్లికాని పిల్లలు', 'గుండమ్మకథ', 'మనిదన్ మారవిల్లై'—చిత్రాలు ఇంతవరకూ వచ్చిన అతని ఇతర చిత్రాలు.

చిన్నప్పట్నుంచి మద్రాసులో ఉండటంవల హరనాథ్ కు తమిళం రాయటం, చదవటం అబ్బినై. 'మా యింటి మహాలక్ష్మి' తమిళ డబ్బింగు ప్రతిని చూసిన, ఏ. వి. ఎమ్. చెట్టియారు, హరనాథ్ ను పిలిపించారు. అతనికి తమిళం వచ్చునన్న సంగతి విని మరింత సంతోషించి—మూడు తమిళ చిత్రాలలో నటించేందుకుగాను అగ్రిమెంటు రాసు

# హరనాథ్

కున్నారు. 'అన్నై' అన్న చిత్రం దీపావళికి విడుదల కాబోతున్నది. ఇదికాక, మరో రెండు ఏ. వి. ఎమ్. చిత్రాలలో అతను నటిస్తాడు. 'అన్నై' చిత్రంలో భానుమతి, జానకి కూడా నటించారు. కృష్ణన్-పంజులు దర్శకత్వం వహించారు. వాళ్లిద్దరూ హరనాథ్ విషయమై చాలా శ్రద్ధ తీసుకున్నారు. ఇదేవిధంగా 'సీతారామ కల్యాణం' చూసిన శ్రీధర్ కూడా, హరనాథ్ ను తమిళ చిత్రంలోకి తీసుకున్నాడు. 'ఆయిరమ్ వాసల్ ఇదయమ్'—ఈ చిత్రం పేరు. ఇందులో అతను ఉపనాయకుని పాత్రను ధరిస్తున్నాడు. ఈ చిత్రాలతోపాటు, 'తల్లీ బిడ్డా', 'మదనకామరాజు', 'పెంపుడు కూతురు', 'ప్రాణ స్నేహితులు', 'అమర శిల్పి జక్కన' (తెలుగు, కన్నడం) అనురూపావారి చిత్రం, నాగేంద్రవారి 'కన్యకా పరమేశ్వరి' మున్నగు చిత్రాలలో నటిస్తున్నాడు. త్వరలో వస్తున్న 'ఆత్మబంధువు' లో అతను 'గెస్టు'గా కనిపిస్తాడు.

"నేను చిత్రవ్యక్తి కంటె, విచిత్ర వ్యక్తిని. నా పద్ధతీ, నా వ్యవహారం మంచిది కాదని చాలా మంది అంటారు. అంటే ఏంలేదు, నాది మొదట్నుంచీ ఒక ప్రవృత్తి. అందరితోనూ, సరదాగా తమాషాగా మాట్లాడతాను. పెద్దలముందు వినయం చూపిస్తాను గాని, వినయం 'నటించటం' నాకు తెలీదు. నా మనఃప్రవృత్తి ఎటువంటిదో — నేను పనిచేసిన దర్శక, నిర్మాత లందరికీ తెలుసు. అసలు నేను కళారాధన కోసం సినిమాల్లో ప్రవేశించలేదు. మనిషి అన్నవాడు ఏదో ఉద్యోగం చెయ్యాలి — డబ్బు సంపాయించాలి — ఆ ఊహతోనే నేనూ వచ్చాను. పైగా — ఈ రంగంలో నాకు ఉత్సాహం కూడా ఉన్నది. కళారాధన నాటకాల ద్వారానే సాధ్యపడుతుందని నా నమ్మకం. అందుకనే నేనూ నాటకాలలో నటిస్తున్నాను — ఎప్పుడూ నటిస్తాను. నాకున్న జీవితాశయం కూడా అదే. పెద్ద ఎత్తున నాటక సమాజాన్ని నడుపుతూ, దేశంలో విరివిగా నాటకాలు ఆడాలని—నా ఆశయం. ఈ ఆశయసిద్ధికోసం, నే నెంతయినా శ్రమిస్తాను — కష్టపడతాను — సినిమాలలో రాణించడానికి, శక్తిసామర్థ్యాలతో పాటు 'అదృష్టం' కూడా ఉండాలని నా విశ్వాసం. అది లేకపోతే, ఎంత నటుడైనా, రాణించలేకపోవచ్చును. నా ఈ కొద్ది సినిమా జీవితంలోనూ నేను చెప్పుకోదగ్గది — అదృష్టం నన్ను వరించే, నేను ముందుకు రాగలుగుతున్నానని! ఈ పరిశ్రమలో ఎందరి తోడ్పాటో అవసరం. అది లేకుండా కూడా ముందుకు రావటం అసాధ్యమే! నేను మొదట్లో కుర్రతనంగా ప్రవర్తించేవాడిని. అదంతా మానిపించి, నాలో వ్యక్తిత్వాన్ని కలగజేసిన దర్శకుడు రామినీడుగారికి నే నెప్పుడూ ఋణపడి ఉన్నాను. అట్లాగే — నన్ను సినిమాలోకి తెచ్చిన పెద్దలందరికీ కూడా నేను ఎంతైనా ఋణపడి ఉంటాను." అన్నాడు హరనాథ్.

హరనాథ్ కు ఇటీవలే వివాహం ఐంది. అతన్ని చూసినవారెవరూ సంసారం నడుపుతున్నట్టున్న మనిషని అనుకోరు. ఎప్పుడూ ఉషారుగా, సరదాగా, సిగరెట్టు పీలుస్తూ, కారు డ్రైవ్ చేసుకుంటూ, బంతల్లే ఎగురుతూ ఆడుతూ పాడుతూ కనిపిస్తాడు. జీవితం ఆనందంగా, తృప్తిగా ఉండాలని అంటే—



చతురంగప్రీతి. ఫొటో: రూప.

ఏమిటని అడిగిన వాళ్లకు హరనాథ్ ను చూస్తే సమాధానం దొరుకుతుంది. ఉన్నదాంట్లోనే తృప్తీ, హాయీ కలగజేసుకోవాలని ఈ యువ నటుడి నమ్మకం!



—సుకుమార్.

# రాజధాని కబుర్లు

13—వ పేజీ తరువాయి

మూడోది, ఈ పెరుగుదల దృష్ట్యా, భూమిమీద పన్ను కూడా పెంచాలసిందే; అయితే యింతవరకు ఆ పన్నుమాత్రం పెరగలేదు.

8. ప్రభుత్వంవారు చెప్పిన మూడు కారణాలు సబబుకాదని, వాళ్ల లెక్కల ప్రకారమే, వాళ్ల ప్రకటనల ననుసరించే, ఋజువు చేయుటానికి, కిసాన్ సమ్మేళనం వారు ప్రయత్నం చేశారు.

మొదటిది, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారే, మూడవ ఫైనాన్స్ కమిషన్‌వారికి అదనపు పన్నుల విధింపు సందర్భంగా, తమ అశక్తతను ప్రకటిస్తూ యిప్పటికే ఈ రాష్ట్రంలో పన్నుల భారం యెక్కువగా ఉంది; యింకా పన్నులు విధించాలంటే, 'అమ్మకపు పన్ను' మినహాయిస్తే యింకో ఆధారంలేదని స్పష్టం చేశారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయం తాలూకు కొంతమంది ప్రొఫెసర్లు, విద్యార్థులు కలిసి 'ఫారమ్ స్టడీ' చేశారు. నాలుగుచోట్ల తిరిగి, నాలుగు విషయాలు సేకరించిన తర్వాత, వ్యవసాయ రంగంలో పడుతున్న కష్టాలు, పెట్టిన పెట్టుబడుల దృష్ట్యా చూస్తే, లాభంపూజ్యం అనే నిర్ణయానికి వచ్చారు.

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక గణాంక శాఖవారు, సేకరించిన లెక్కల ప్రకారం, సేద్యానికయ్యే ఖర్చు విపరీతంగా పెరిగిపోయిందన్నారు. ఈ విషయం అనంతరామన్ కమిటీవారు కూడా అంగీకరించినదే!

1956 సంవత్సరంలో భూమిమీదనుంచి వచ్చే, ప్రభుత్వాదాయం ఏడుకోట్ల ఏభై రెండు లక్షలవుతే, 1962 సంవత్సరం నాటికి, అదే పన్నెండు కోట్ల, అరవై అయిదు లక్షలదాకా పెరిగింది. అందువలన, భూమిమీద పన్ను పెంచలేదనటం కూడా ఊహాగానమే!

౮. ఈ నగ్నసత్యాన్ని గుర్తించే, బీహార్ ప్రభుత్వం వారు 'అదనపుశిస్తు బిల్లును' ఉపసంహరించుకున్నారు. ఇతర రాష్ట్రాలలో కూడా దీని విషయమై అలజడి బయలుదేరి పునరాలోచనకు అవకాశం కల్పించబడింది. శ్రీ ప్రకాశ్‌లాంటి ప్రముఖవ్యక్తి కూడా భూమిమీద శిస్తు పెంచటం అక్రమమని సుస్పష్టం చేశారు. చిత్తూరు ఉప ఎన్నిక తర్వాత, పండిట్ నెహ్రూ కూడా, ఈ అదనపు భూమి శిస్తు విషయమై పునరాలోచించవలసిందిగా ప్లానింగ్ కమిషన్ వారిని కోరటంకూడా జరిగింది. (ప్లానింగ్ కమిషన్ అధ్యక్షులు పండిట్ నెహ్రూయే!)

ఈ పై కారణాల దృష్ట్యా, యీ అదనపు భూమిశిస్తు చట్టాన్ని (ఆంధ్రప్రదేశ్ గవర్నర్‌గారు యీ భూమిశిస్తు బిల్లుమీద తన ఆమోదముద్ర కూడా వేశారు) ఉపసంహరించుకోవలసిందిగాను ఉపసంహరించుకోవటంవలన తమ ప్రతిష్ఠకు భంగపాటు కలుగుతుందేమో ననే అపోహపడకుండా, తక్షణం, రైతులకు మేలు చేకూర్చవలసిందిగా వినతి చేయుటం జరిగింది.

గవర్నర్‌గారు శ్రద్ధాసక్తులతో వినతి పత్రాన్ని పరిశీలించారు; రాయబార వర్గాన్ని తృప్తిపరచారు. ఇక ముఖ్యమంత్రిగారివద్దకు వెళ్లినప్పుడు 'అవును నిజమే. మీరు చూపిస్తున్న కారణాలన్నీ సబబ

అయితే ప్రణాళికలు అమలుజరిగి తీరాల్సిందే! వాటిని ఆపటానికి యెవ్వరి తరంకాదు. ప్రణాళికలకు డబ్బు కావాలి. మిగతా యే రంగాన్ని కదిలిద్దామన్నా ఆదాయం లక్షల్లో వస్తుందిగాని, కావలసిన కోట్లల్లో రాదు. అందువలనే భూమిపన్ను పెంచటం తప్పనిసరయిం'దన్నారు.

భారతదేశానికి వెన్నెముక రైతు. అలాంటి రైతు వెన్నెముకే విరగగొట్టేలాగున, యీ అదనపు భూమిశిస్తు చట్టాన్ని తెచ్చిపెట్టి బలవంతంగా డబ్బు వసూలుచేసి, యీ ప్రణాళికలు అమలు చెయ్యకపోతే వచ్చిన ప్రమాదం యేమిటో అర్థం కాదు. ప్రాజెక్టులు కావలసిన మాట వాస్తవమే! మరి వాటికి కావలసిన డబ్బు విషయం కూడా ఆలోచించే, అలాంటి భారీఎత్తువి ప్రారంభించాలిగాని, ఆఁ లోపే మోయలేని ప్రణాళికలన్నీ వేసుకుని, పిచ్చి ఎత్తినవాళ్ళు తిరిగినట్లు డబ్బుకోసం, యెక్కఁ పడితే అక్కడ కక్కుర్తి పడటం, యెవరు మెత్తని వాడుగా కనిపిస్తే వారినే చావబాదటం, ఆలోచనా రహితంగానూ, అర్థరహితంగానూ కనిపిస్తుంది.

ఈ మధ్యనే, ప్రభుత్వంవారి దృష్టి బంగారం మీదకూడా పడింది. దేశంలో బంగారం కొల్లలు కొల్లలుగా పడివుంది. దాన్ని ఎట్లాగైనా లాగేసి, యీ పంచవర్ష ప్రణాళికలను అమలుచేయటానికి ఉపయోగించుకోవాలి అనే అభిప్రాయం వెలిబుచ్చారు. దీనినిబట్టి, ప్రభుత్వం యెంత నిస్సహాయ స్థితిలో వుందో తేట తెల్లమవుతోంది. విచక్షణా రహితమైన పన్నులను విధించటంలో, ముందుముందు ఒరగ బోయే లాభాలు యేమోగాని, ప్రస్తుతంమాత్రం యీ పన్నులు కట్టలేక, మోయలేని భారంతో క్రుంగి కృశించిపోవటం జరుగుతుంది. వసూళ్ళ సమయంవస్తోంది. ఈనాడు రైతు తిండి, బట్ట, నివాసానికి వెతుక్కుంటున్నాడు. కష్టించి, శ్రమించి సంవత్సరం పొడుగునా దిగులుతో క్షీణించిపోతున్న రైతు, ధాన్యం కోతకొస్తోందిగదా అని, చిరునవ్వు పెదిమల మీదికి బలవంతంగా తెచ్చుకునే సమయంలో యీ అదనపు భూమిశిస్తు చట్టం గొడ్డలిపెట్టులాగా వచ్చిపడింది. అయిఁ ఖర్చులకోసం చేసిన బుణాన్ని యెట్లా తీరుస్తాడో, కుటుంబాన్ని యెట్లా పోషిస్తాడో, యీ రెండూ అయినతర్వాత మిగిలిం దెంతుంటుందో, యిక యీ పన్ను కట్టేదేమిటో! నీ అప్పులతోనూ, నీ కుటుంబంతోనూ మాకేమీ అవసరంలేదు, ముందర మా శిస్తు మాకు చెల్లించమని, ప్రభుత్వంవారు కంఠంమీద కత్తిలాగా కూర్చుంటే జరిగేదేమిటో చూడాలి!

కొన్ని ప్రాంతాల్లోగాని, కొన్ని తరహాల భూములకుగాని, యీ చట్టం వర్తించకుండా చెయ్యాలసి వస్తే, అంటే—అక్కడ యీ పన్నుల భారం బాగా ఎక్కువగా కనిపిస్తే, దానికి సంబంధించిన సవరణ తీసుకురావటానికి అవకాశం వున్నట్లు ముఖ్యమంత్రి గారు వెల్లడిచేశారు. ఈ పన్నుల భారం అంతటా ఒకటే! అయితే తరతమ భేదాలుండచ్చు. అందు వలన కేవలం కొన్ని ప్రాంతాలకే, కొన్ని తరహా భూములకే యీ చట్టంఅమలు మినహాయింపు చేసే ప్రయత్నంలో పక్షపాతం రాకమానదు. వేటికి మినహాయించాలనటంలో భేదాభిప్రాయాలు తప్పకుండా వస్తాయి. దీనివలన పరోక్షంగా, రైతాంగంలో చీలికలు రాగల సావకాశాలుకూడా వున్నాయి. ఈ సాధక బాధకాలన్నీ గమనించాలసి వుంటుంది.

* * *

ప్రముఖ కాంగ్రెసు నాయకులు, స్వాతంత్ర్యమ వీరులు అయిన శ్రీ మల్లిపూడి పళ్ళంరాజు ఁస్తమించటం, ప్రతివ్యక్తియొక్క హృదయాన్ని ఁలవరపెట్టింది. ఆయన జీవితం అంతా దేశసేవకే అంకితమయిపోయింది. కాంగ్రెసులో నానాటికి పెరిగిపోతున్న గ్రూపు తత్వాలకు అతీతుడై, ఉభయులమధ్య సామరస్యం సాధించటానికి ఆయన చేసిన ప్రయత్నాల్లో స్వార్థం అడ్డుగా నిలవలేదు. ...ంత్రిపదవి, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులుగా వుండి, పెద్దమనిషిగా వ్యవహరిస్తూ సంజీవయ్య, సంజీవరెడ్డిగార్ల మధ్య పెరిగిపోతున్న దూరాన్ని తగ్గించటానికి శాయశక్తులా ప్రయత్నం చేశారు. ఆరోగ్యం అంతగా లేకపోయినా, బాధ్యతలు పెట్టుకుని, యేదైనా, ఒక మంచి పని చేద్దామనే సేవాభావం, తాపత్రయంతోనే జీవితాన్ని గడిపారు. ఇలాంటి పెద్దమనిషి లేక పోవటం, ఆంధ్రప్రదేశ్‌కు దురదృష్టమే అని చెప్పాలి. రాజధాని ప్రజలు ఆయన భౌతిక దేహాన్ని ఆఖరిసారిగా దర్శించి అశ్రుతర్పణం చేశారు. అయితే ఆయనలోవున్న సామరస్య స్వభావాన్ని పెంపొందిస్తూ, మంచితనాన్ని పెంచుకున్నప్పుడే, నిజంగా ఆయన ఆత్మకు శాంతి చేకూర్చినవాళ్లం అవుతాం.

—వి. యాల్ యాన్. ★

# ఎవరివో!

## నాగరాజ్

ఎవరివో! ఓ దేవి! నీవెవరివో!
దేదీప్యమాన దివ్యసుందర రూపిణీ
కల్యాణగుణా కమనీయభాషిణీ
కలలోన కనుపించు కోమలాకృతివి
రాజవదనా! గజరాజ గమనా ॥
బాలహరితప్రభా భ్రాజమానాంశుకా
కాంచనాంబుజశోభా కమనీయ కంచుకా
మాననీయము గు మాంగళ్యమహిమతో
కనుల పండువుగాగ కనుపించు దేవి ॥
మరచిపోదామన్న మరువనీయవు నన్ను
పలుకరింతామన్న పరకీయవౌదేమో
లోతు తెలియని నా ధైర్యసాగరమందు
బేల చూపులతోడ బడబాగ్ని రేపెదు॥
పలికెదేదోగాని పలుకనీయవు నన్ను
పలుకులన్నియు నాకు పలవరింతగ దోచు
భావమేదో తోచు భగ్నమగునంతనే
భావవేదులకైన భావ్యమానవుగావో॥
మాయవేత్తలకైన మోహకారణమయ్యు
పట్టిచూడగవచ్చు పరమేశు రాణివో—ఓ దేవి—
శాస్త్రసారము దెలిపి సత్యబోధనసేయ
సరగున వరుగిడు సరసిజాసను వాణివో।
ఎవరివో! ఓ దేవి! నీ వెవరివో॥

ఇంటిల్లిపాదికీ ఆనందం కలిగించే
ఆంధ్రసచిత్ర వారపత్రికను తప్పక చదవండి.

# హరివంశము

16వ పేజీ తరువాయి

...సము చేసి యూరకున్నారు. సరే ! ఇప్పుడు వచ్చుచున్నారు. ఉజ్జయిని ధన్యమైనది .... ఇక నేను పోవలయును ...."

అని మహారాజు బయలుదేరుచు మరల ఆగెను. ఆగి భార్య ఒడిలో నున్న కూతురు మిత్రవింద వంక చూచెను. చూచి గల్లున నవ్వెను. "చిట్టి తల్లీ ! మేనబావ వచ్చుచున్నాడని నీకు ముందుగానే తెలియునేమి ! అమ్మ దగ్గరకు పరుగుపెట్టి వచ్చినావు. ఇక నేను పోవుచున్నాను....." అని మరల ఆగి, భార్యవంక అదియొక విధముగా చూచి, "ఓసి ! రాజాధి ! నీ మేనయల్లుడు గొల్లడు. అభీరుడు. చిన్నతనముననే వానిని వాని తండ్రి అరణ్య అజ్ఞాతవాసములకు పంపెను. వాడు మా పిల్లకు తగునందువా?" అని, వేసిన అడుగులో అడుగుగా నిలబడెను.

ఈ ఉపన్యాసమును వినుటకేగాని, మాటాడుటకు ఆయన ఆమెకు ఎడము కల్పించలేదు. ఇప్పుడు ఆమె మాటాడినది. కుమార్తెను గుండెకు అదుము కొనుచు మాటాడినది. "స్వామి ! నగరమును అలంకరింప బంపినారా ! ఆచార్యునకు స్వయముగా స్వాగతి నెరపుటకు పూనిక వహించినారా!" అన్నది.

"ఊ ! ఇందులో వక్రోక్తి గూడనా ! ఆ నల్లని వాడు మాకన్న చిన్నవాడు. వానికి మేమేల రాజ మర్యాదలు చేయువలయును. మరియును ఓసి ! యాదవుల ఆడబడుచా ! యాదవులకు రాజ్యార్హత లేదే! వారు సింహాసనస్థులు కావుటకు అధికారము లేదే" అనినాడు.

రాజాధిదేవి నవ్వినది. "మహారాజ! మీయీ పరిహాస శీలిత్వము పిల్లలలో గాఢ శీలముగా పరిణమించుచున్నది. వారికి మా పుట్టినింటిపై వైరము పెరుగుచున్నది."

అన్నంతలో ఆమె ముఖము పరిదీనము, విషాద జటిలము అయిపోయినది.

"దారుకుడు నాకోసము రథముతో వేచి యున్నాడు. మేము పోవలయును. కావలయునన్ని రాజకార్యము లున్నవి. ఆడవారి మాటలు వినుటకు మే మిచ్చట లేము" అనుచు, అనకృద్ధానము చేయుచు మహారాజు అటనుండి కదలిపోయినాడు.

రాజాధిదేవి మిత్రవిందను కన్నులతో చూచి, చేతులతో ఆత్మకు హత్తుకొని, "నా తల్లీ !! నా తల్లీ !" అన్నది.

వామాక్షి కిలకిల నవ్వినది.

"వదినకు మా అన్న రాత్రి కలలో కన్పించినాడు" అన్నది.

**హారీత శివశర్మ.** ★

# మీరు ఎంత తొందరలో వున్నాసరే
# నీవియాను
# ఉపయోగించగలరు

నీవియా క్రీం అనేక విధాల ఉపయోగపడుతుంది. ఇది ప్రకృతికి అత్యంత సన్నిహితమైంది. చర్మాన్ని ఇది మృదువుగాచేసి, పోషించి, రక్షిస్తుంది. ఇతర క్రీములు చేయలేని పనిని నీవియా చేస్తుంది—అలసిపోయిన గ్రంధులకు నవోత్తేజం కలిగిస్తుంది. మీ చర్మాన్ని, పొంకంగా, ఆరోగ్యంగా, యవ్వనంగా వుంచుతుంది. ఆమెకూ, అతనికీ, బేబీకి కూడా దాని సుకుమార రక్షణకు మించినది లేదు.




కాంతివంతమైన చర్మానికి నీవియా సాటిలేనిది

ఫిలడెల్ఫియాకు గాని రాజదంపతులు వెళ్తారు.

జులై మాసంలో మొనాకో కోట 'టూరిస్టు లకు' (చూడవచ్చిన వారికి) వీలుగా ఉండే నిమిత్తం తెరిచి, రాణీ, రాజా కూడా కొండలలో గల ప్రత్యేక మందిరానికి వెళ్లిపోతారు.

రాణిని వెనుక ఆమె తారగా ఉన్నప్పుడు ఎలా ఉందనీ, ఇప్పుడెలా ఉందనీ అడిగితే ఆమె ఇలా చెప్తుంది:

"ఒక్కొసారి స్టూడియోల్లో ఉదయం ఏడు మంచి సాయంకాలం ఆరు వరకూ పని చేసే దాన్ని. ఇక్కడలాకాదు. మా పనులన్నీ రాజ ప్రాసా దంలోనే ఉంటాయి. దీనికీ దానికీ పోలిక ఎక్కడ ? లేనేలేదు."

ఆమె ఇంకా ఇలా చెబుతుంది : "నా కిక్కడ గల ముఖ్యమైన బాధ్యతలు : అతిథులను మావారితో కలిసి ఆహ్వానించడం, ఆయన గల సభలకూ, సత్కా రాలకు కూడా హాజరవడం లాంటివే" .... ఇదిగాక ఆమె రెడ్‌క్రాస్ సంస్థకు (మొనాకో) అధ్యక్షు రాలు కూడా .... దాని పని కొంత ఉంటుంది ..... "ఆసుపత్రులూ, శరణార్థ మందిరం కూడా నేను అప్పుడప్పుడు పర్యవేక్షిస్తూ ఉంటాను."

అయితే వీటన్నింటికన్నా ముఖ్యమైన బాధ్య తలు ఆమెకున్నాయి కదా ? అవే ఆమె ఉద్దే శంలో గృహిణిగా ఆమెకున్న బాధ్యతలు. పిల్లల్ని చూసుకోవాలి. భర్తకేం కావాలో చూడాలి.

స్వయంగా ఆమె వంటవాడితో ఎలాంటి పదా

# నేనూ మా రాజుగారూ

9-వ పేజీ తరువాయి

ర్థాలు, ఏ వంటకాలు వండాలో చెబుతూ ఉంటుంది. పాలెస్‌లో గాకుండా, కొండమీద ఇలా శలవుగా గడిపి నప్పుడైతే ఆమె వండుతుంది కూడా.

వంట అంటే వండేవాడికన్నా రాణికే పని ఎక్కు వగా ఉంటుంది. ఎందుకంటే .... ఒక్కో వంటకం ఏడెనిమిది రకాలుగా చెప్పి చేయించాలి .... ఆమె స్వయంగా చూస్తుంది ఇవన్నీ ....

కాండీ, చాకలేట్‌లు ఎప్పుడూ డైనింగ్‌రూమ్‌లో సిద్ధంగా ఉండాల్సిందేనట. అయితే ఆమె తినదు. సిగరెట్‌ల టిన్నులెప్పుడూ నిండుగా అమర్చి ఉంచాలి గాని రాణి అసలు కాల్చదు.

పూలంటే గ్రేస్‌కి ప్రీతి. చాలా మోజు పడు తుంది. పూలకుండీల్లో ఎక్కువగా ఆమె బంగారు వర్ణం పూలు ఉంచాలంటుంది.

రాజప్రాసాదం : రాణిగారికి ప్రత్యేకంగా నలు గురు డ్రైవర్ లున్నారు. ఆమెకు చెలికత్తెలు, దాసీజనం అంతా కలిసి మాట ఇరవైమంది దాకా ఉంటారు. వాస్తవానికి ఎక్కువమంది రాజ దాసదాసీజనం, ఇతర పనివాండ్రు మొనాకో వాసులే అయినా, వారిలో చాలామంది ఫ్రెంచివారు, అమెరి కనులు, ఇంగ్లీషువారూ ఉన్నారు.

ఒక బెల్జియను కూడా ఉన్నాడు. రాణిగారి ముఖ్యమైన దాసీ లిద్దరూ స్థానిక వాసులే. మరో ప్రధానమైన చెలికత్తెగా ఫ్రెంచి వడుచు ఉన్నది. రాణిగారి కార్యదర్శిగా మిస్ 'బ్లమ్' అనే అమెరి కన్ వనిత పనిచేస్తూంది.

పిల్లలకి నర్సుగా ఇంగ్లీషు వడతి మారిన్ కింగ్ అనే ఆమెను నియమించారు.

అమెరికన్ విదేశాంగశాఖలో , వ్యవహరించిన ఆర్థికవేత్త, మార్టిన్ డేల్ అనే ఆయన రాజుకు ప్రధాన సలహాదారులలో ఒకడు. ఇంక ఇతర దేశస్తులు, బెల్జియనులూ రాజుగారి ఉద్యోగులలో ఉన్నారు.

రాణీగ్రేస్, ఎక్కడికి వెళ్లాలన్నా—ఇటీవల ఆమెతో ఒక చెలికత్తె ఉండితీరాలి. ఒక ప్రయి వేటు డిటెక్టివ్ కూడా విధిగా ఉంటాడు.

ఎప్పుడేనా రాణి అనధికార హోదాలో తన పుట్టింటికి వెళ్లినప్పుడు చెలికత్తెకు మారుగా, సెక్రటరీ బ్లమ్ ఉండొచ్చును. కాని ఎవ్వరో ఒక్కరు ఆమెతోకూడా ఉండితీరాలి.

సభలు, ఉత్సవాలు అవి జరిగినప్పుడు రాజా, రాణి రాగానే అంతా లేచి నించుంటారు. వారు ఆసీనులయ్యేవరకూ ఎవరూ కూచోరాదు.

(ఇంకావుంది)

# అతడు తిరోష్మఖుడు కాలేదు...

1920 వ సంవత్సరంలో, అప్పుడే స్కూలు నుంచి బైటికొచ్చిన పి. కె. ఛటర్జీ అను యువకుడు టాటా స్టీలులో ఎప్రంటిస్ డ్రాఫ్ట్స్‌మన్‌గా చేరాడు.

క్రొత్త విషయాలు నేర్చుకోవాలనే వాంఛ, ఆశయం పూర్తిగా అతనిలో ఉవ్విళ్ళూరుతున్నందున, విరామ సమయమందు చదువుకోటానికి సదుపాయముండే కంపెనీ వారి టెక్నికల్ స్కూలులో ప్రవేశించాడు. ఇంజనీరింగులో మూడేళ్ళ కోర్సు ప్రథమంగా పూర్తిచేసిన వారిలో ఒకడైనాడు యువక ఛటర్జీ.

అలాగ పనిచేస్తూ కొద్ది ఏళ్ళలో ఛటర్జీ ఇంజనీరింగు డిపార్టుమెంటులో బాగా పైకొచ్చాడు! బ్లాస్టు ఫర్నేసులు ఆతనికి అభిమాన వస్తువులైనవి. జంషెడ్‌పూర్ కర్మాగారములో ఆతని సహాయముతో పునర్నిర్మాణము కావింపబడిన బ్లాస్టు ఫర్నేసులలో, పూర్తిగా అతని డిజైను ప్రకారం పునర్నిర్మాణం కావింపబడిన ఒక బ్లాస్టు ఫర్నేసు దినమునకు 1000 టన్నుల శక్తి కలిగినది గూడా ఉన్నది — భారత దేశంలో ఇలాటి ప్రయత్నం ఇదే మొదటిసారి.

ప్రత్యేక ప్రణాళికలమీద ప్రస్తుతం అసిస్టెంటు ఇంజనీరుగా పనిచేస్తున్న ఛటర్జీ వివిధ ప్రదేశములు సందర్శించి, ప్రపంచమంతటా బ్లాస్టు ఫర్నేసులను డిజైను చేయువారి మన్ననలకు పాత్రుడైనాడు.

జంషెడ్‌పూర్ నగరమందు నిర్మాణ శక్తికి తగు విలువనిచ్చి పెంపొందింపబడు ననుటకు ఇది మరొక తార్కాణము. ఆ నగరంలో పరిశ్రమ కేవలం జీవనోపాధియే కాదు, అది ఒక జీవన పథము.






**జంషెడ్‌పూర్**

ఉక్కు నగరము

The Tata Iron and Steel Company Limited

# న్యూ ఢిల్లీ లేఖ

7-వ పేజీ తరువాయి

దేశం ఎప్పుడూ దురాక్రమణకు లోనౌతూనే ఉంది. గతమంతా అంతే. ఇతర దేశాల మాదిరిగా భారతీయులకు దురాక్రమణ కండూతి లేకపోగా, వాళ్లు మాట్లాడేదంతా అహింస, శాంతులను గూర్చే. లోగడ పలుమార్లు దౌర్జన్యం జరిగింది, ఇంకా జరుగుతున్నది. ఇప్పుడు ఈ దౌర్జన్యాన్ని ఒక వ్యక్తి తన దేశంమీద, తన మిత్రులమీద—ఆఖరికి తన బంధువులమీద జరుపుతున్నాడు. మహమ్మద్ ఘోరీ కొద్దివేల సైన్యంతో వచ్చి ఢిల్లీపై దాడి జరిపి, పృధ్వీరాజును అవమానించి ఓడించి సామ్రాజ్యాన్ని స్థాపించటమేగాక అతడు, అతని తరువాతివారు సుమారు తొమ్మిదికోట్లమందిని తమ మతంలోకి మార్చగలిగారన్నది జగమెరిగిన నిజం. హిందువుల్లో "ఈ శాంతికాముక సుగుణం' లేకపోతే దండెత్తినవాళ్లని ఎప్పుడో వేళ్లమీద ఏరిపారేసేవారు.

శాంతి, అహింసలను గురించి చెప్పుకోవటం మంచిదే గాని అసలీ దేశంలో ఒక శతాబ్దంగా మిగిలివున్న దేమిటూ? దానిఫలితం ఏమిటంటే,చైనా తన మామూలుధోరణిలో మన దేశంలో కొంత భాగం ఆక్రమిస్తే, ఒక సర్వ—స్వతంత్రజాతి తన భావాలను ప్రకటించేందుకు కావలసిన సంచలనం మనలో కలిగినట్లు దాఖలా కూడా లేదు. తరచు కాల్పులకు దారితీస్తూ భారత—పాకిస్తాన్‌ల మధ్య ఎదురు బొదురు సంఘటనలు జరుగుతున్నా మనప్రజల్లో ఏలాంటి చైతన్యము కన్పించలేదు. అసలు చైతన్యమంటూ వస్తే పెద్ద పెద్ద తాటికాయలంత అక్షరాలతో వార్తాపత్రికల్లోనే కన్పించింది. సర్వత్రా మన అస్త్రసన్యాసానికి దాఖలా ఇది.

మహాత్మాగాంధీ నాయకత్వం ఆదర్శంగా స్వీకరించిన ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ, చైనాతో సంప్రదింపులు జరపాలంటున్నారు. లోగడ మహాత్మాగాంధీ, జిన్నా పలుకుబడి ముసల్మానులలో బాగా తగ్గిపోయిన తర్వాతనే ఆయన్ను (జిన్నాను) చర్చల కాహ్వానించిన విషయం అందరికీ తెలిసిందే. మహాత్మాగాంధీ సంప్రదింపులన్నీ దేశ విభజనాన్ని గూర్చి కాదు. హిందూ ముస్లిం సఖ్యతను తీసుకురానూ లేదు.

శ్రీ నెహ్రూ ఆఫ్రికాలో ఉన్నప్పుడు ఒకసారి వలస తత్వాన్ని తెగనాడారు. వలస తత్వ మనేది సామ్రాజ్యవాదం నుంచి పుట్టిందే. ధనిక వర్గాల ప్రజలే సామ్రాజ్యవాదులని చరిత్ర ఋజువు చేస్తుంది. బ్రిటిష్ కార్మికపక్షం సామ్రాజ్యవాదానికి తీవ్రవ్యతిరేకిగావుంది.బీద,మధ్యతరగతివాళ్లు ఏదేశంలో వున్నా అలాగే వుంటారు. అయితే చైనాకుమాత్రం ఇది వర్తించదు. ఎందుకంటే చైనాలోని ప్రతి కూలీ కూడా ఓ సామ్రాజ్యవాది!

* * *

హిందూస్థాన్ నౌకా నిర్మాణసంస్థ వార్షిక నివేదికను ఇక్కడ ప్రకటించారు. కొచ్చిన్‌లో రెండో నౌకా నిర్మాణశాల నెలకొల్పాలని ఈ నివేదికలో నౌకా నిర్మాణ సంస్థ మళ్లీకోరింది. ఇందుకుగాను శ్రీ రాజ బహదూర్ త్వరలో జపాన్ వెళ్ళనున్నారు కూడా. నౌకా నిర్మాణంలో అన్నివిధాల తగ్గుదల కన్పిస్తున్నప్పటికీ సరఫరాల స్థితిమాత్రం అవసరానికి మించి ఎంతోఎక్కువగా వుందని ఆ నివేదికలో వుంది. ప్రపంచంలోని అన్ని నౌకా నిర్మాణసంస్థలు ఒకదానికన్న ఇంకోటి ధరలు తగ్గించి పోటీపడుతున్నాయని ఆ నివేదిక తెల్పింది. ఉత్పత్తిని పెంచి, ధరలు తగ్గించేందుకుగాను, పరిశోధనలపైన, ఆధునాతన పద్ధతులపైన చాలా ధనం ఖర్చుపెట్టటం జరిగింది. తీవ్రమైన ఈ పోటీ కారణంగా హిందూస్థాన్ నౌకా నిర్మాణ సంస్థ, నిర్మాణవ్యయం చాలా తక్కువ పట్టినా గిట్టుబాటులేని ధరకు మిట్సు బిషీ రకం నౌకలు తొమ్మిదింటిని తయారు చేయాల్సి వచ్చింది.

ఇతర దేశాల్లో ప్రత్యక్ష పరోక్షపు పద్ధతులపైన విచక్షణారహితంగా ఇస్తున్న ఆర్థిక సహాయాల వల్ల ఎగుమతి వ్యాపారాలు సంపాదించుకోటానికి తాము చేస్తున్న ప్రయత్నాలు విఫలమయ్యాయని బ్రిటిష్ నౌకాసంస్థల యజమానులు ఇటీవల ప్రకటించారు.

1956వ సం. లెక్కలు ప్రాతిపదికగా (టన్నేజి 100) జరిగిన ఒక పరిశీలన ప్రకారం 1961 సం. లో జర్మన్ టన్నేజి 97, ఇటాలియన్ 92, ఫ్రెంచి 150, బ్రిటన్ 86 గా తెలుస్తోంది. అదే పరిశీలన ప్రకారం, ఇటలీలో నౌకా నిర్మాణ వ్యయంలో 27%, ఫ్రాన్స్‌లో 35% లు ప్రభుత్వాలు భరించాయని తెలియవచ్చింది. ప్రపంచంలోకల్లా పెద్దనౌకా నిర్మాణ దేశమైన జపాన్‌లో టర్నోవర్ పన్నులేదు. ఎగుమతిలాభాల్లో 80% గాని ఎగుమతి టర్నోవర్‌లో 5% గాని కంపెనీపన్నునుంచి తగ్గిస్తారు. దీనికి తోడు నౌకా నిర్మాణ సంస్థలు తమ వార్షిక నిస్సుంక లాభాల్లో 35% లు మూలధనాలుగా మార్చుకునే అవకాశం ఉంది. జపాన్ దేశపు ఎగుమతి—దిగుమతి బ్యాంక్ నౌకా నిర్మాణ సంస్థలకు—వందకు 4—5 వడ్డీపై (సామాన్యంగా ఇచ్చే వడ్డీలో సగంఅన్నమాట) ఋణాలు ఇస్తుంది. ఇటీవల అర్జెంటైనాలో జర్మన్‌లు ఇచ్చిన టెండర్లు జపానీ వాటికన్న 37.14% ఎక్కువగా వున్నాయి. స్కాండినేవియన్ దేశాలు తమ దేశాల్లోని నౌకా నిర్మాణ సంస్థలకు తక్కువ వడ్డీకి అప్పులూ, ఉదారంగా ఆదాయపు పన్ను ముదరాలు ఇస్తాయి.

మరి ప్రపంచం మొత్తంమీద ఇలాంటి క్లిష్ట పరిస్థితి ఏర్పడినప్పుడు భారతదేశం ఇంకో నిర్మాణశాల స్థాపనకు ఎందుకు పూనుకుందో అర్థంకాదు. హిందూస్థాన్ నౌకా నిర్మాణశాల చైర్మన్, 1964 మధ్యకాలంనుంచి తగినంత పని కల్పించుకోవాలంటే, నిర్మాణశాలలో ఇంకా ఎక్కువ నౌకలు నిర్మించాల్సి వుంటుందని షేర్ హోల్డర్లకు చెప్పారు.

నౌకా నిర్మాణసంస్థకు గత ఏడాదిలో వచ్చిన రు 43000 ల లాభం, ఎటువంటి సహాయానికి అతీతంగా తయారైన చిన్నచిన్న నౌకల మీదనే వచ్చిందని హిందూస్థాన్ నౌకా నిర్మాణ సంస్థ వార్షిక నివేదికలో పేర్కొన్నారు. ప్రభుత్వం నుంచి రు 89, 58, 887 ఆర్థికసహాయం తెలిసిన తర్వాతే ఈ లాభాన్ని లెక్కకట్టటం జరిగింది. విదేశీమారకం క్లిష్ట పరిస్థితిలో దీన్ని ఐదవ పంచవర్ష ప్రణాళికదాకా వాయిదా వేయటం మంచిదేమో! ★

# యువ ప్రపంచం

## విద్యా ప్రమాణాలు

విద్యా వ్యవస్థ క్షీణించడానికి, విద్యా ప్రమాణాలు పడిపోవడానికి ముఖ్యమైన కారణాలు రెండు: ఒకటి, విద్య చెప్పించే ఆర్థిక స్తోమతు గలవారు తక్కువగా ఉండడం. రెండవది, విద్యకు తీరని ప్రోత్సాహం లభించకపోవడం. విద్యావిధానాల్లో మన దేశానికి, విదేశాలకు చాలా భేదముంది. అక్కడ విద్యార్థులు తమ విద్యార్థి దశలోనే డబ్బు సంపాదించి తమ చదువుకు తామే పెట్టుకుంటారు. అందువలన వారి విద్య తలిదండ్రుల ఆర్థికస్థితిమీద సాధారణంగా ఆధారపడి ఉండదు. కాని మన దేశంలో పరిస్థితి వేరు. విద్యార్థుల విద్యకయ్యే ఖర్చంతా తలిదండ్రులు భరించవలసి ఉంది. విద్యార్థులు పనిచేసి విదేశ విద్యార్థులవలెనే డబ్బు సంపాదిద్దామన్నా అటువంటి అవకాశాలు మన దేశంలో చాలా తక్కువ. అసలు లేవనే చెప్పవచ్చు. తీరా విద్యార్థుల తలిదండ్రులు డబ్బు వందలు, వేలు వ్యయంచేసి చదివినా, ఉద్యోగాలు దొరుకుతాయని నమ్మకం లేదు. అందుచేత చాలామంది విద్యపై డబ్బు వెచ్చించడానికి ఇష్టపడరు.

ఇక రెండవది: విద్యార్థులు ఎంత ప్రయత్నించినా వారికి సరియైన ప్రోత్సాహం లభించకపోవడం. మన రాజకీయ నాయకులు కులతత్వాలు, మతాతత్వాలు, ప్రాంతీయ భేదాలు ఎంతగా పమసిపోవాలనుకుంటున్నారో అవి అంతగా విజృంభిస్తున్నాయి. ముఖ్యంగా కులభేదం (Casteism), రికమెండేషన్లు - ఈ రెంతూ విద్యావ్యవస్థకు గొడ్డలిపెట్టుగా పరిణమిస్తున్నాయి. విద్యార్థుల సీట్ల దగ్గరనుంచి ఉద్యోగాల వరకు-ఆఖరికి రాజకీయ నాయకుల పదవుల వరకూ కూడా ఇవి సంభవిస్తూనే ఉంటాయి. ఏ దరఖాస్తు ఫారం చూసినా ("If Hindu-state caste") అనే అక్షరాలు కొట్టొచ్చినట్లు కనిపిస్తాయి. ఉన్న భూమీ పుట్రా అమ్మి చదవడం, చదివిన తర్వాత ఉద్యోగాన్వేషణ చేసే విద్యార్థులకు ఈ కులభేదాలవల్ల తరచు చెడ్డ ఫలితాలు సంభవించడం వల్ల వారికి సరైన ప్రోత్సాహం లభించదు. ఈ కులతత్వ భేదాలు ధనికవర్గంవారి నంతగా బాధించవు. పేదవర్గంవారు అట్టే మంది చదవరు. కాబట్టి వారినీ బాధించవు. ఇక ఎటొచ్చీ ఇవి మధ్యతరగతి కుటుంబీకుల మీదే ఎక్కువ ఫలితాన్ని చూపెడతాయి. విద్యార్థుల, అభ్యర్థుల విలువలు, వారి 'మెరిటు'నిబట్టినిర్ణయించడం సబబు. అంతేకాని వారి బాహ్య పరిస్థితుల మీద, వారి కులమతాల్నిబట్టి నిర్ణయించడం న్యాయమనిపించుకోదు. పైగా దీనివల్ల విద్యావిషయాల్లో అసంతృప్తి ప్రబలే పరిస్థితులు మాత్రం సంభవిస్తాయి. ఏది ఏమైనా మన విద్యావిధానాల్లో ఈ మార్పులు కలుగచేసేటంతవరకూ విద్యా ప్రమాణాలు అభివృద్ధి కానేరవు.

వి. వి. ఆర్. (వాల్తేరు)

## విద్యార్థుల సమస్య

ఇటీవల ప్రొఫెషనల్ కాలేజీల ప్రవేశము విద్యార్థులకు ఒక సమస్యగా తయారయింది. ప్రతి ప్రొఫెషనల్‌కోర్సు (ఆంధ్ర) దాదాపు జూన్ నెల మధ్యనుండి జూలై మొదటివారం వరకు అప్లికేషను ఫారములను తీసుకుంటుంది. అంటే దాదాపు అప్లికేషన్ను తీసుకునే కాలం ఒక నెల అన్నమాట. దీనికితోడు సీట్లు ఇవ్వబడిన లిస్టు వెంటనే ప్రకటిస్తున్నదా అంటే అదీ లేదు. సీట్లు ఇవ్వబడిన లిస్టు ఎప్పుడో జూలై నెల చివరగాని లేక ఆగస్టు మొదటివారంలోగాని ప్రకటించడం రివాజయింది. ఉదాహరణకు ఒక విద్యార్థి ఒక ప్రొఫెషనల్ కోర్సుకు అప్లై చేస్తాడనుకోండి. అంటే అతనికి సీటు వచ్చినదీ లేనిదీ జూలై చివరగాని తెలియదుగదా. అప్పటివరకు తక్కిన ఆర్ట్సు కళాశాలలు చేతులు ముడుచుకొని కూచోవు. అవి జూన్ నెలాఖరులోగా ప్రవేశాలను పూర్తిచేస్తాయి. జూలైనుండి మామూలుగా క్లాసులు ప్రారంభిస్తారు. అటువంటప్పుడు ప్రొఫెషనల్ కోర్సులో సీటురాని ఆ విద్యార్థికి ఆర్ట్సు కళాశాలలో సీటు (బి. యస్ సి. బి. కాం. బి. ఎ) ఎట్లా ఉంటుంది? సంవత్సర సంవత్సరానికి విద్యార్థుల సంఖ్య పెరిగిపోయే ఈ తరుణంలో కళాశాలల్లో కొంచెం ఆలస్యంగా విద్యార్థికి సీటుదొరకటం అసంభవం. కాబట్టి ప్రొఫెషనల్ కోర్సులన్నీ సాధ్యమైనంత త్వరలో అంటే జూన్‌నెలలోనే ప్రవేశాలు పూర్తిచేసి జూలై మొదటికల్లా సీట్లువచ్చినవారి లిస్టు ప్రకటించడం ఎంతో అవసరం. రానున్న సంవత్సరానికైనా ఈ పద్ధతి అమలులోకి వస్తుందని ఆశిద్దాం.

కొంపల్లి సుందరరావు (గుంటూరు)



ASP/TI-10 TEL.




# పిల్లలకు తుషార్‌తో తయారైన వంటకాలు బాగా రుచించును

తుషార్ వనస్పతిలో పిల్లలకు యిష్టమయ్యే ప్రత్యేకమైన రుచి వుంది. తుషార్‌తో వండిన ఆహారం రుచికరమే గాక పుష్టికరం గూడా. ఎందుకంటే తుషార్‌లో ఎ,డి విటమినులు వున్నాయి. రుచికరమైన భోజనానికి తుషార్‌తో వంటచేయండి.

## తుషార్

వనస్పతిలో ఎ,డి విటమినులు కలవు.

తుంగభద్రా ఇండస్ట్రీస్ లిమిటెడ్, కర్నూలు

---




'యూనిటీ' ట్రేడు మార్కుతో భారత దేశంలో తయారుచేయువారు:

గెస్ట్, కీన్, విలియమ్స్, లిమిటెడ్, పో. బాక్సు నెం. 575, బొంబాయి-1

'యూనిటీ' రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు జార్జి గుడ్‌మన్ లిమిటెడ్ వారిది రిజిస్టర్డ్ వాడకదారు:- గెస్ట్, కీన్, విలియమ్స్, లిమిటెడ్.




# కొత్త నుడికట్టు-11

## అడ్డం

1. బావ (చిన్న సైజది)
3. సామంతులు కట్టేది, మాయము.
6. టర్కీదేశంవారు !
7. భూమి.
8. ఇవి కావు !
9. కొత్త పొడిగిస్తే పడవ.
10. ఇతనికి బావ ఉంటాడు.
11. వరుస.
12. ఆనక ముందు అనతి !
13. మన్మథుడు తలక్రిందులు !
14. శిరస్సు ధాన్యము ఎవరికి అధిపతి ?
16. సంజీవరెడ్డిగారు మంత్రివర్గానికి ఇది !
17. నేస్తము.

## నిలువు:

2. వక్క రుచి.
3. రచయితలు !
4. అవివరములలో ఒకటి, కాని తలక్రిందులు.
5. ఒక రకమయిన నృత్యం. (కేరళది)
6. మంచివాడు కాదు.
8. ఇది కాదు !
9. సామెతలు.
10. మీ కాదు !
11. నీరు వేడిచేస్తే కనిపించవచ్చు.
12. ఆ ఘాటు
14. పక్క.
15. ఇదీ—, అంటారు.



---

## 10-వ కొత్త నుడికట్టుకు జవాబులు.

### అడ్డం:

(1) ఆనక, (3) రాతిమేడ, (5) సిద్ధము, (6) పలక, (7) చిలుక, (9) కొత్త (11) హాలాహాలం, (13) మెలకువ, (14) పన్నా, (15) మురుగు, (17) బెరడు, (19) కాపలా, (21) సారంగము, (22) గుర్రము.

### నిలువు

(1) ఆవల. (2) కసి, (3) రాము, (4) మేకులు, (6) పరిహారము, (8) కలువరేడు (10) మెత్త, (12) పలం, (16) రుధిరం, (18) రకము, (19) కాము, (20) లాగు.

# పొట్టికథలు

## నిజమెంత

ముగ్గురు మిలిటరీ ఆఫీసర్లు ఒక క్యాంపులో శలవురోజున ఒక సినీమా చూస్తూ కలుసుకున్నారు. ఇంటర్‌వెల్ సమయంలో మొదటి ఆఫీసర్ యిలా అన్నాడు. “ఈ సినిమా ఉత్త చెత్త” రెండో అతనందుకున్నాడు. “మెల్లిగా అంటారేం! పరమ బోరుగావుంది...” కాని మూడో ఆఫీసర్ గంభీరంగా వూరకున్నాడు. ఏమండీ మీరేమంటారు!” అన్నాడు. తొలి పెద్దమనిషి.

‘నేను కాంప్లిమెంటరీ ప్యాసు మీద వచ్చాను’ అన్నాడతడు. “పాపం!” అన్నారిద్దరూ. అంతలోనే ఆ ప్యాసు మీద వచ్చినాయన బుకింగ్ ఆఫీసుకు చరచర వెళ్లి ఓ టిక్కెట్ కొనుక్కొని వచ్చి “పాపమా! మరి పాపమా! ఘోరం...యీసినీమా కంపుకొడుతూందంటే నమ్మండి” అన్నాడు.

మాలతీ లత (విజయనగరం)

## సరైన జవాబు

భాగవతాన్ని తెనిగించిన కవీ, శ్రీనాథుడూ - ఇద్దరూ బావమరదులు. ‘సిరికిన్ జెప్పడు’ అన్న పద్యం చదివి, శ్రీనాథుడన్నాడుకదా: “బావా! గజేంద్రుడు పిలవగానే అలా తాడూ లేక, బలగమూ లేక పరిగెత్తాడే నీ విష్ణువు. ఇదెక్కడైనా విన్నామా?” అన్నాడు.

ఈ వెటకారానికి పోతన నవ్వి ఊరుకున్నాడు.

“ఔను బావా! వెర్రిబాగుల వాడు దేవుడు...” అన్నాడు.

మర్నాడు శ్రీనాథుని కుమారుడు ఆడుతూ పాడుతూ పెరట్లోని బావిలోన పడిపోయాడు. శ్రీనాథుడు పరుగు పరుగున వెళ్లి నిస్సహాయంగా నూతిచుట్టూ తిరుగుతూ, “నాయనా! బాబూ! ఏమిరా!” అని గాభరా పడుతున్నాడు.

పోతన సాయంగా నిచ్చెనా, తాడుతో వచ్చి, “బావా! అలా ఉత్తచేతులతో ఏలనయ్యా? చిందులూ... వెనకటికి గజేంద్రునికై శ్రీ విష్ణువు వెళ్లినట్లూ?” అన్నాడు.

—పి. ఎస్. వాస్, (విజయవాడ)

## బాలుని లేఖ

ఒక పన్నెండు సంవత్సరాల స్కూలు బాలుడొకడు అమెరికను అధ్యక్షునిగా ఐసెన్‌హోవర్ ఉన్నకాలంలో ఆయనకు ఒక ఉత్తరం రాశాడట. అందులో ఆ కుర్రాడిట్లా రాశాడు.” అయ్యా! బడిపంతుళ్ళను యుద్ధంలో నికిషిలిచి ఉద్యోగాలిస్తున్నారని విన్నాను. నిజమైతే యింతవరకు అలాంటి పిలుపు నందుకోని ఒక టీచర్ వున్నాడు ఆయన వయస్సు 26. ప్రస్తుతం మా బళ్ళో పంతులుగారు. పెద్దచేతులు కాళ్లూ వుంటాయి. మీ యిష్టం” అని.

చిరంజీవిబాబు






Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7. Thambuchetty Stree
Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

